# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు :

డాక్టరు కే. యస్. కేసరి

# GRIHALAKSHMI

సంపుటము ౨౧]     ఫిబ్రవరి 1952     [సంచిక ౨





## చందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

వస్తున్నారు! వస్తున్నారు!





వధూవరులు
వస్తున్నారు!

విజయ
వారి

# పెళ్ళిచేసిచూడు






దర్శకుడు.... ప్రసాద్ • నిర్మాతలు..... నాగిరెడ్డి & చక్రపాణి



శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు
1952 వ సం॥ 'గృహలక్ష్మి' స్వర్ణకంకణ గ్రహీత.




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# ఎన్నికల ఫలితములు



జయాపజయములు సహజంగా దైవాధీనములంటారు. కాని మన దేశంలో జరిగిన ఎన్నికలందు వివిధపార్టీలు సాధించినవిమాత్రము అట్టివికావు.

కాంగ్రెస్ మహాసంస్థయొక్క నాయకత్వము కుంటుబడింది. దాని మూలంగా దానిబలము చిన్నాభిన్నమయింది. దానికితోడు జాతీయశక్తులలోని అనైక్యతవలన వారు సాధించవలసిన విజయం సాధించలేక పోయారు. వారిలో ఏర్పడిన చీలికలు వారి బలహీనానికి హేతువైంది. పైగా కమ్యూనిస్టు పార్టీల్లాంటివి బలపడినవి. ఇది ఎన్నటికి హర్షింప తగిందికాదు.

కాంగ్రెస్ మహోన్నతమైన సంస్థ అనేది నిర్వివాదాంశము. దేశస్వాతంత్ర్య సమరంలో అది నిర్వహించిన నాయకత్వము, చేసినత్యాగములు, సాధించిన లక్ష్యములు చిరస్మరణీయములు. ఈ నాటికికూడ ప్రజలు కాంగ్రెస్ పూర్వచరిత్రను తలచుకొని భక్తి కృతజ్ఞతలను వెల్లడిస్తున్నారు.

కాని కాంగ్రెస్ ముఖ్యంగా మద్రాసు రాష్ట్రంలో పరాజయం చెందటానికిగల కారణాలు తలవనితలంపుగా ఏర్పడినవికావు.

కాంగ్రెస్‌యొక్క పూర్వపు మహత్తర చరిత్రతో ప్రజలు తమ దైనికావసరాలు గడుపలేరు. సంస్థలో ఏర్పడిన వర్గపోరాటం, స్వార్థచింత, అధూయిత్వము, అవకతవకలు పెచ్చుపెరిగిపోయినవి. ఇవి కాంగ్రెస్ ప్రభుత్వ నిర్వహణలోకూడ చొచ్చుకొనిపోయి దైనికసమస్యలైన కూడు, గుడ్డ మొదలగు వాని పరిష్కారమునకు బదులు లంచగొండితనము, దొంగమార్కెటు, బంధుజనప్రేమ, దైనికావసరముల ధరల పెరుగుదల విపరీతములయినవి. దాని మూలంగా ప్రజల జీవితం దినదినానికి దుర్భరముగా పరిణమించింది. దానితోటి కాంగ్రెస్ నాయకత్వము జారిపోతున్నదని చాల కాలము క్రిందటనే నిశ్చయమైంది. ప్రజలు ఈ పరిస్థితులలో తమ దైనిక జీవితాన్ని చక్కబెట్టుకోదలచి తమ యిచ్చవచ్చిన రీతిగా తమ ప్రతినిధులను ఎన్నుకోక తప్పింది కాదు. ఇందుకు నాయకత్వములోని లోపం కారణం.

ఈ ఎన్నికల ఫలితములు దేశశ్రేయస్సుకొరకుపకరించగలవని మేము చెప్పలేము. కాని ఆ ఫలితాలను తప్పని సరిగా నిర్మించింది మాత్రము మద్రాసు రాష్ట్రంలోని కాంగ్రెస్ నిర్వాహకులని చెప్పక తప్పదు.

ఇక స్త్రీ ప్రతినిధుల విషయంచూస్తే - సంఘసేవాతత్పరులు, జాతీయసమరయోధులు అయిన శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మ, శ్రీమతి భారతీదేవి రంగా, శ్రీమతి అన్నేరాజ్యం, శ్రీమతి అమ్మన్నరాజాగారలు సయితం పరాజయం చెందారంటే కాంగ్రెస్ ప్రభుత్వముయడల ప్రజలకు ఏర్పడిన అసంతృప్తి ఎట్టిదో తేటతెల్లమగుచున్నది.

ఇక ముందైనా జాతీయశక్తులు సంఘటితపడటం ఎంతైనా అవసరం. ఇంకా పరిష్కారము కావలసియున్న స్త్రీల సమస్యలను ప్రజాప్రతినిధుల సభలలోను, ప్రజల యెదుటనుంచి వారి సానుభూతిని సంపాదించి, పరిష్కరించవలసియున్నది. ఈకృషి మునపటికంటె ప్రస్తుతపు ఎన్నికల ఫలితాల దృష్ట్యా ద్విగుణీకృతము కావలసిన ఆవశ్యకత ఏర్పడినది.

ఎన్నుకోబడిన ప్రతినిధులు సయితము ప్రజలదైనిక సమస్యలను గుర్తించి జాతీయ విధానమునకు ప్రాముఖ్యము నిచ్చుచు ప్రజాశ్రేయస్సుకు, దేశ ఔన్నత్యమునకు కృషి చేయగలరని మా విశ్వాసము.

———(o)———

# స్త్రీల పాటలు

## ప్రబంధాలలో ప్రశస్తి



విద్వాన్
శ్రీ కాలకంధరం సంజీవరాయశర్మ

తెలుగు సాహిత్య క్షేత్రమున నిండార పండి శాశ్వత స్థానము నలంకరించిన పద కవిత్వము నన్నయనాటినుండియు ప్రచారములోనుండి, ప్రబంధశాఖ విస్తరిల్లిన వెనుక మాటుమణఁగి దేశిసరుకు ముదుసళ్ల నోళ్ల లోనే ముగ్ధమోహన కళాసౌందర్యమును వ్యక్తమొనరించుచు నానారీతులుగా వారి నోళ్లలోనలఁగి అనేకములగు ప్రబోధములకు దారితీసినది. ఈ పదములలో సామాన్యముగా వ్యావహారిక భాషయే ప్రధానముగా నుండి సుసంస్కృతములైన పదములు కొన్నియును అసంస్కృతములైన పదములు కొన్నియునుగా, విలసిల్లినది. ప్రబంధ కవిత్వము విస్తరించిన వెనుక పదకవితకా నాడు తలవంపులుగలిగి, పండితుల మనమున కవలంబముగాక పామరులపాలిట పెన్నిధియై, వఱలినది. ఏదో వారికానందము కలిగినపుడే పదకవులు స్వచ్ఛందగతిని అమందగతితో ఆనందముగా పాడుకొనుచు నితరులనట్లే అనుకరించుటకు మార్గదర్శకులైరి. వారి సుఖదుఃఖములు, వారికష్టనిష్ఠూరములు వారి ఆనందమునకు అదర్శముగానుండి, పెక్కురీతులతో ప్రజల మనములను చూఱగొన్నది. ప్రబంధకవితకు వలె పదకవితకు రాజాదరణ లేదు. కాని పంద్రెండవ శతాబ్దమున జానపదుల జీవిత వికాసమునందు గొప్ప మార్పును, చలనమును కలుగజేసినవాడు పాల్కురికి సోమనాథుడు. గ్రామీణుల జీవితమందలి వృత్తులను తన కృతులలో చక్కగా తెలిపినాడు. వారు పాడినపాటలే తన కావ్యములకు బుక్కులని నొక్కిచెప్పినాడు. ఈ పదకవిత్వమును ప్రబంధకర్తలు సైతము తమకృతిక్షేత్రములలో సూచించిరి. కొందరు పదకవిత్వమును దూలనాడిరి. కొందరు భూషించిరి. కార్వేటినగర సంస్థానములో రాజాస్థానమున వెలసిన సారంగపాణి యీ క్రింది విధముగా వేణుగోపాలస్వామిని హెచ్చరిక చేసినాడు.

"పాటపాడి మెప్పించనా
పదముచెప్పి వలపించనా" అన్నాడు.

తాళ్లపాక అన్నమయ్య బహుభంగులతో ప్రయోగ వైచిత్రులతో పదములు రచించి విశేష ఖ్యాతికి నోచుకొన్నాడు. శ్రీనాథుడు కవిత్వమును చెప్పినాడు. పదములు చెప్పినాడు. (పల్నాటి వీరచరిత్ర) కాని "కవితల్ చెప్పిన పాడనేర్చిన వృథా కష్టంబె" అని ఒకచో వాపోయినాడు. "పాడనేర్చిన" అన్నపదమును బట్టియే అతడు పదములు సైతము రచించియుండునని తలంపనగును. పదకవిత్వమును క్రింది విధముగా విభజింపవచ్చును.

పదములు — వాని విభజన

1. జాతీయజీవన ప్రతిబింబములు-జోల పాటలు, తలుపుదగ్గర పాటలు, మంగళ హారతులు, ఒప్పగింత పాటలు.

2. ఆచార వ్యవహారములు - నాగారు బొమ్మపాటలు, అక్కలపాటలు.

3. వ్యవసాయిక జీవనము - పడవపాటలు, ఊడుపుపాటలు, ఊర్పిళ్ల పాటలు, దంపుళ్ల పాటలు.

4. తత్వగీతములు - పోతులూరి వీర బ్రహ్మంగారి తత్వములు.

5. భక్తి పదములు - తులసి పాటలు; గోవిందనామాలు.

6. కొన్ని కాలములందే వినిపించునవి - గొబ్బిపాటలు, బతకమ్మపాటలు. గంగిరెద్దు పాటలు.

7. పురాణాది గ్రంథముల పాటలు - సత్యభామ సరసము, ధర్మరాజు జూదము, లంకాయాగము.

పైని పేర్కొన్న విభాగములే కాక పద కవిత్వమును నెన్నియో తీరులుగా విభజింప వచ్చును. కాని ప్రస్తుతము స్త్రీల పాట లనుగూర్చియు వానికి ప్రబంధ సాహిత్య ములోగల ప్రశస్తియు నిటవిలభింతును.

జోల పాటలు

ఈ జోలపాటలు తెలుగు నెలతలు తమ ముద్దు నిసుగులను నిదురబుచ్చుటకై పాడె దరు. నిసుగులీ పాదములందలి మాధుర్య మును, అవ్యక్తమగు ఆనందమును కొలుపు నవిగావున వారు నిద్రింతురు. ఈ పాటలు ఉత్తమాశయములతో ప్రకృష్టభావములతో నుచితరీతి నొప్పారుచుండును. ఈ జోల పాటలకు ప్రబంధములలో నెట్టి వలుకు బడిగలదో పరికింతము. మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రమునందు యీ క్రింది విధ ము గాకలదు.

కేళీ కాంచనసౌధ వీథికలచక్కిన్
తొట్లలో బెట్టియో
ప్రాలేయాచల కన్యకాధవకృపా
సారంగతానిద్రవో
వే లావణ్యపయోనిధీ యనుచు
నావిర్భూత మోదంబుతో
జోలల్ వాడుదు రక్కుమారకునకున్
శుద్ధాంత కాంతామణుల్.

—రాజ, 3.వ ఆశ్వా

జలకంబున్ తగమార్చి నెన్నుదుట
రక్షాకాంతి పాదాంగుళీ
స్థలమృత్స్నా తిలకంబుదీర్చి రుచులన్
దట్టాడు వజ్రంపు టు
య్యేలపై పొత్తులనుంచియోశుధర
కన్యాధీశ దివ్యాంశ పే
శలమూర్తీ! నిదురింపవేయను సుతున్
చంద్రాస్య జోకొట్టుచున్

సుధ - 2.వ ఆశ్వా

భాగవతమునందు శ్రీకృష్ణునకు జోకొట్టి నిదురపుచ్చినటుల కందపద్యము నందు పోతన వర్ణించినాడు. ఆతడు పద్య మున వర్ణించినను అది పదమువలెనేనున్నది. ఈ జోలపాటల ప్రశస్తి, ప్రసక్తి పెక్కు ప్రబంధాలలోకలదు.

### పడవ పాటలు

పడవపాటలు స్త్రీలు పాడినటులుగా శ్రీనాథుడు చాటువులో చెప్పినాడు.

"వీనులకు విందులై తేనె సోనలెనయ
ముందురాగంబునను జగన్మోహనముగ
పాడెనొక జాలరిమిటారి యీడులేని
కాకతీనాదమున నోడగడపుపాట"

### ఊయల పాటలు

ఈ పాటలు యెక్కువ ప్రచారములో నుండినట్లు తెలియుచున్నది. ప్రఖ్యాత సంకీర్తనాచార్యులు, పదకవితా పితామహుడు నగు తాళ్లపాక అన్నమయ్య నీ ఉయ్యాల పదము రచియించి యున్నాడు.

"అలరచంచలమైన ఆత్మలందుండనీ
అలవాటుచేసె నీ ఉయ్యాల"

ఊయలపాటలు స్త్రీలు పాడినట్లుగూడ వ్యక్తమగుచున్నది. విష్ణుపురాణమందు "ఉయ్యాల తొట్టిలోనునిచి, చేతులు వట్టి ఊచి యూడెడుపాట నుబ్బనేర్చె".

ఇట్లే నన్నెచోడ కుమారసంభవములో వసంతకాలమున ఊయలపాటలు పాడినటులు తెలియును.

"ఎలమి జిలుకపిండు దోలు మేనజేసిన
తపమువండబండె తరువనంబు;
లువిదలింపు మిగుల 'నూయలపాటలు'
వాడమధువనమునబాడె నళులు"

—కుమా, 4, 89

పైపద్యమునందు ఊయలపాటలు పేర్కొనబడియున్నది. కాని యీ పద్యము వేరువిధముగా శ్రీ బులుసు వెంకటేశ్వర్లు గారు వావిళ్ల నిఘంటువున 'ఊయలపాటలు' అనుటకుమారుగా 'ఓయలపాటలు' అని వ్రాసిరి. ఆ పద్యములో వారన్నట్లు 'ఓయల పాట'లనుట కన్నను 'ఊయలపాట'లనుట మిక్కిలి సమంజసము. పార్వతి వసంత సమయమున ఊయలమీదనుండి ఊయల పాటలను పాడునుగాని శృంగార పుపాటలు పాడవలసిన ప్రమేయములేదు. ఊయల పాటలు అనుపాదమును, ఓయలపాటలు అనుపాదమును యతిస్థాన స్థాపితమునకు సరిపోవుచున్నను, పైనిపేర్కొన్న విష్ణుపురాణమందలిదియు, తాళ్లపాకవారి పదమును ఉయ్యాల పాటలను మిక్కిలి బలపరచుచున్నది. ఊయలపాటలు వినియున్నాము కాని, ఓయలపాటలు ఎందును వినలేదు. మరియొక ప్రయోగమును చూపినచో నమ్మ తగినదిగానుండును.

### సువ్వాల పాటలు

అప్పకవీయమునందు సువ్వాలకొసగిన ఉదాహరణము.

"అక్షర హారివిక చాంబురు హాక్షా,
యాక్ష సనఖనుత యదుకుల దక్షా,
రక్ష కసురవిదుర ద్విపరక్షా,
గాక్షస విదళన ప్రరుచిర వక్షా. సువ్వీ
పక్షగ పతిరథ పౌండ్ర విపక్షా,
భక్షిత ధవశిఖ బహుసవ దీక్షా,
వృక్షగ సహచర ఋక్ష సదృక్షా,
ఋక్ష పదుహిత్వ ఋషిజన పక్షా, సువ్వీ

ఈ సువాల విషయమునుగూర్చి "దారుకావనక్రీడ" యనెడి యక్ష గానమునందు యీక్రింది విధముగా చెప్పబడియున్నది.

# తలవని తలంపు ★ శ్రీమతి వఝ్ఝల లక్ష్మీకాంతంగారు

రామారావు అప్పుడే ఆఫీసునుంచివొచ్చి గదిలో ఈజీచైరులో కూర్చుని, ఆలోచిస్తున్నాడు తన స్కూలు జీవితం గురించి. రామారావు స్కూలు ఫైనల్ చదువుతుండగా, సరోజకూడ తరుడుఫారం చదువుతూవుండేది. ఆమెకప్పుడు పదిహేనేళ్లు వుంటాయి. తను ఆమెను ప్రేమించేడు కాని, ఆమె ప్రేమించిందోలేదో అతనికి తెలియదు. కాని, ఆమెకళ్లు అతన్ని ప్రేమిస్తున్నట్టే వుంటాయి. ఆమెను స్కూల్లో చూడ్డమేకాని ఆమె ఎక్కడ వున్నది అతనికి తెలియదు,

ఒకనాడు రామారావు కుర్చీలో కూర్చునీ, ఎదురింటిమేడమీదకి దృష్టిమరలించాడు. రామారావు ఆశ్చర్యపోయేడు. రోజూ తన స్కూల్లో చూస్తూన్న సరోజ కనిపించింది. అతని ఆనందానికి మేరలేదు.

సరోజ రామారావు దగ్గరకు వచ్చింది లెక్కలు అడగడానికి; రామారావు చెప్పేడుకూడ. సరోజ తండ్రీ రామారావు దగ్గరకు అంతకుముందేవచ్చి, మాసరోజకు లెక్కలు కొంచెం డౌటుగా వున్నాయి మీరుకాస్త చెప్పాలి అని అన్నాడు. రామారావు ఆనందానికి మేరలేదు. సరోజ అప్పుడప్పుడు రామారావు దగ్గరకు వస్తూవుండేది.

దీపావళి పండుగ వచ్చింది. సరోజ తండ్రి రామారావు దగ్గరకువచ్చి, "ఇవాళ దీపావళి, మా యింటికి భోజనానికి రావాలి" అని పిలిచేడు. రామారావు ముందు తటపటాయించేడు. 'కాని' ఆయన బలవంతంమీద "సరె" అన్నాడు. దీపావళీ రోజు సరదాగా గడిచింది, ముఖ్యంగా సరోజ పాటవల్ల. ఆమెకు అంత మధురమైన గొంతుక వుందనీ, సంగీతం అంత గొప్పగా వచ్చునని అతనికి ఇదివరకు తెలియదు. భోజనాల ముందర సరోజ తండ్రీ "మా అమ్మాయి, వీణ వాయిస్తుందండి" అని అన్నాడు. "అలాగనా" అన్నాడు రామారావు తన ఆనందాన్ని వెల్లడిస్తూ.

భోజనాలు అయ్యాక, రామారావు సరోజ తండ్రితో అన్నాడు, "మీ అమ్మాయిచేత ఒక్క పాట పాడించండి" అని. అప్పుడు సరోజ ఎంత బాగా పాడింది! ఆ పాట విన్నంతసేపు అతను ఈ లోకాన్నంతటిని మరిచిపోయేడు; కనీసం అలా అనుకున్నాడు.

ఆమె అప్పుడప్పుడు వస్తూవున్నది. ఆమె వచ్చినప్పుడల్లా పాటపాడమని అడుగుతూ వుండేవాడు, ఆమె పాడుతూ వుండేది.

ఇంకపరీక్షలు, దగ్గర పడుతూ వున్నాయి, బాగా చదవ నారంభించేరు. పరీక్షలు అయేయి. స్కూలుకి శెలవలు ఇచ్చేశారు. ఓనాడు రామారావు, సరోజ, ఇద్దరూ బీచికి వెళ్ళారు. అక్కడ రామారావు, తన ప్రయాణం గురించి చెప్పాడు, తన వూరు వెళతానని. ఆమె ముఖం ఎర్రపడి కళ్లంట నీరు వచ్చింది. అది రామారావు గమనించాడు. ఆమె రెండు చేతులు పట్టుకుని, స్కూలు తెరవక ముందరే వస్తానని చెప్పాడు. ఆమె, తన ప్రేమను వెల్లడిచేసింది, తన్నేకాని మరొకరిని పెండ్లిచేసుకోనని. తనుకూడ అలాగే చెప్పాడు. ఇద్దరూ ప్రమాణాలుకూడ చేసుకున్నారు.

తను, స్కూలు తెరవకముందే వచ్చాడు, "కాని" వాళ్లులేరు. అక్కడ వున్నవాళ్ల నడిగితే, సరోజ తండ్రికి వొంట్లో బాగుండలేదనీ, వాళ్ల స్వస్థలం వెళ్ళిపోయేరని చెప్పారు. నిరాశతో వెళ్లిపోయాడు.

ఈ రెండు ఏండ్లలోగా ఆమెకు పెండ్లి అయిందో లేదో! అప్పటినుంచి వాళ్ల జాడ, ఇప్పటికీ కూడ తెలియదు. ఈ విషయం రోజూ ఆలోచించడం అతనికి ఒక అలవాటయిపోయింది.

ఇంతలోకి తండ్రిదగ్గరనుంచి వుత్తరం వచ్చింది. తన్నిరమ్మనమని, పెండ్లిసంబంధం చూశారని. రామారావు ఇంతకుముందు చూసిన ఏఒకపిల్ల నచ్చలేదు. రామారావుకు సరోజనితప్ప మరివొకపిల్లని చేసుకోడం ఇష్టంలేదు. కాని, తనతండ్రి గట్టిగా వుత్తరం వ్రాశాడు, ఈ సంబంధమేనా చూసిఒప్పుకోమని. రామారావు ఆఫీసుకి శెలవుపెట్టి వెళ్లక తప్పింది కాదు.

♦ ♦ ♦

సరోజతల్లి, సరోజతో "నువ్వు ప్రేమించిన అతను ఇవాళ నిన్ను చూసేందుకు వస్తాడు. నువ్వు పట్టిన పట్టు విడవకుండా చేసినందుకు ప్రతిఫలం వచ్చిందిలే, జడావుట్రా వేసుకో" అని తల్లిచెప్పగానే సరోజకు పట్టలేని ఆనందం కలిగింది.

రామారావు చూసేందుకు వచ్చేడు పిల్లని. ఆశ్చర్యం! తనుపెళ్లి చేసుకుంటానని ఎవరికివాగ్దానం చేశాడో, ఆమె! అతను, తనకళ్లని నమ్మలేకపోయాడు. కలా, నిజమా, అని భ్రమించాడు.

ఆనాడు దీపావళి. సరోజ, రామారావు, చాల సంతోషంగా నున్నారు. భోజనాలముందర రామారావు "మనం స్కూల్లో చదువుతూవున్నప్పటి దీపావళి వచ్చింది" అనేసరికి, సరోజకు జ్ఞాపకం వున్నట్టు, అతనివేపు చూసింది. "ఏది ఇవాళకూడ నీ మధురమైన కంఠస్వరముతో ఒక్కపాటపాడు" అని అడిగాడు. ఆమె, పాడేసరికి అతను ఈ లోకాన్నే మరిచిపోయాడు. దీపావళి, సరదాగ వెళ్లిపోయింది.

---

# అపూర్వ సువాసినీ విలాసము

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన అపూర్వ సువాసినీ విలాసంబను "ఆధునిక అల్ప ప్రబంధము"నకు కథాక్రమం బెట్టిదనిన:

అది శరశ్చంద్రికల్ గాయు నర్ధరాత్రి బాలపవనుడు మెల్లగా జోలపాడ
నిద్రజెందిరి కలతల భద్రపరచి ఆరుబైటను జనులు బజారులందు.

ఆ సుఖపూరితంబయిన యర్ధనిశీథిని నిద్రరానిదై
ఆసలుచల్లబడ వదనాబ్జము నిండిన కారుమేఘముల్
బాసలునేర్చు నేత్రముల వర్షజలంబుల నించుచుండగా
దోసములేని శిశుకయి దుఃఖముజెందెడి కాంతగాంచితే!

పండువుగనున్న నాటిరే యెండలోన మధురనిద్రల లోకంబు మత్తుజెంద
వేడిరక్త ప్రవాహ విపీడనమున దిగులునెందును వైధవ్యశగలనుడికి.

అత్తమామల సరసాల నాలకించి పొరుగు ముసలమ్మ మగనితో మురియజూచి
నిండుప్రాయాన నొడలెల్ల మండుచుండ పండుకొనెనేమో నిద్దురపట్టలేదు.

మగనిమరపించి మోదంపు మగనిగూడ పోయివచ్చిన ప్రక్కింటి పూజ్యురాలు
చెంబుచేగొని పతిచెంతజేరె మరల మగడుగల్గిన వనితదే తెగువజూడ.

ఆ నడిరేయి నిట్లుతిరుగాడెడి జారులనెల్ల గాంచుచున్
జ్ఞానవిహీనసంఘ నియమావళిరోసి కఠోరజీవితా
యానము దుర్భరంబయిన యాతనగా కనుపించుచున్నయా
మానిని మానసాంకురపు మంటలు కంటిని మూయనిచ్చునే.

జలముతేబోయి ఇంచుక జాగుసేయ అత్తకనుమానముల్ మొలకెత్తుచుండు
ఆడుబిడ్డకు వెటకార మతిశయించు ఇరుగుపొరుగున గుసగుసల్ ఇగురులెత్తు.

మగడులేనియువతి జగతికిలోకువ అగునుకాదె అన్ని అవసరముల!
తరువులేనిలతకు తన్నులు తప్పునా! మానవాళియందు మసలునపుడు.

మగడుగల్గి నూరుమగల నాసించిన మగువజోలికేగ తగవుకాదు
విధవపెండ్లియాడ వెలివేయ సమకట్టు సంఘ నీతి గ్రుడ్డి చక్రవర్తి.

ఇట్టియోచన తనమదిన్ గట్టిజేయ చుట్టుప్రక్కల తిలకించుచుండెనామె
ఎదుటివాకిట నిద్రించు సదయుడొకడు మేలుకొన్నట్లు కంఠంబు మేళవించె.

తలవనితలంపుగానామె గళరవంబు స్మృతిగలుపురీతి మెల్లగా జేరెనతని
గళరవంబులెవారికి కంఠమాలలై వివాహంబు జరిగె నా యర్ధరాత్రి.

పొగరుబోతుతనంబున పోయెననుచు ఏమిసేయును యవ్వనకామియనుచు
తల్లిదండ్రులుజేసిన తప్పెయనుచు కలియుగంబున వేయునాల్కలు జెలంగె.

మనోరమాదేవి

# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనియై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది - కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.






## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది:

# రమణీస్

# బేబిగ్రైప్



తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్లు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెన్సీస్ - విజయవాడ, శికింద్రాబాద్,
బరంపురము (గంజాం), బొంబాయి.

# పిల్లల ఆయురారోగ్యాభివృద్ధి

(అంతర్జాతీయ పిల్లల రక్షణ మహాసభకు చెందిన అంతర్జాతీయ పోషణ సంఘం ప్రచురించిన విజ్ఞప్తి కార్యక్రమం.)

1952 ఏప్రిల్ 12, 16 తేదీలలో వియన్నాలో జరగనున్న అంతర్జాతీయ పిల్లల రక్షణమహాసభకు చెందిన అంతర్జాతీయ పోషణ సంఘం పేరులో యీదిగువ విజ్ఞప్తినీ, కార్యక్రమాన్ని ప్రచురించింది. అందులో యిలావుంది :

మనపిల్లల జీవితాలకూ, భవిష్యత్తుకూ రానున్న ప్రమాదం మనలను ఎంతో కలవరపెడుతూంది.

చాల దేశాలలో పిల్లల ఆరోగ్యం దిగజారిపోవడంవల్లనూ, పిల్లల చావులు ఎక్కువ కావడంవల్లనూ భావిపౌరుల సంతతి ప్రమాద స్థితిలోనుంది.

సైనిక ప్రయత్నాల ఫలితంగా పిల్లలు చాల కష్టాలకు గురిఅయారు. ఎందువల్లనంటే సైనిక ఖర్చుల వల్ల ఆరోగ్యరక్షణకూ, గృహనిర్మాణానికీ, విద్యకీ బడ్జటు కేటాయింపులు తగ్గింపబడుతున్నాయి. అనేక కుటుంబాలు తమ పిల్లలకు అవసరమైన మంచిఆహారాన్నికూడా పెట్టలేకపోతున్నాయి. ఆహారకొరత, కరువుకాటకాలు తీవ్రంగానున్న అనేక వలసదేశాలలో లక్షలకొద్ది పిల్లలు చచ్చిపోతున్నారు.

లక్షలకొద్ది కొరియన్ పిల్లలు విమానదాడులవల్ల చనిపోవడంగాని, పారిపోతున్నప్పుడు ఆకలివల్ల, చలివల్ల మరణించడంగాని జరిగింది.

మనకికూడా అటువంటి దురదృష్టమేగానిపడితే మనపిల్లలకికూడా అలాగే జరుగుతుందని మేమెంతో కలవరపడుతున్నాము.

మానవకోటి అమూల్య సంపద అయిన పిల్లలను రక్షించడానికి సహృదయులైన స్త్రీ పురుషులందరూ, పిల్లల విషయాలలో శ్రద్ధవహించే సంస్థలన్నీ పిల్లల ఆయురారోగ్యాభివృద్ధి హక్కుల రక్షణకు తీసుకోవలసిన చర్యల గురించి చర్చించబోయే అంతర్జాతీయ పిల్లల రక్షణ మహాసభలో పాల్గొనవలసిందని విజ్ఞప్తి చేస్తున్నాము.

ఈ ఆశయసిద్ధికి తోడ్పడే వారందరికీ మేము విజ్ఞప్తి చేస్తున్నాము. మా విజ్ఞప్తినీ, కార్యక్రమాన్ని బలపర్చవలసిందని వారిని కోరుతున్నాము.

పిల్లల రక్షణ మహాసభ కార్యక్రమం యీ దిగువరీతినుంది :

అనుభవంమీదనూ, సమస్యాపరిశీలనమీదనూ ఆధారపడిన అభిప్రాయాలను స్నేహపూర్వకంగా, యదార్థంగా, అధికారయుతంగా ఒకరికొకరు తెలియజేసుకున్న తరువాత యీ మహాసభ సమిష్టి కృషితో పిల్లలకు సంబంధించిన ప్రధాన సమస్యలను పరిష్కరించడానికి మార్గాలను నిర్ణయించాలి.

మరొక యుద్ధ ప్రమాదంనుండి పిల్లల జీవితాన్ని, ఆరోగ్యాన్ని కాపాడాలి.

పిల్లలకు అవసరమైన ఆహారానికీ, వసతికీ, వైద్యసహాయానికీ హామీవుండాలి.

## పిల్లల ఆయురారోగ్యాభివృద్ధి

ప్రమాదకరమైన సారస్వతంనుండీ, అవినీతికరమైన రేడియో ప్రసారాలనుండీ ఫిల్ములనుండీ పిల్లలను రక్షించాలి; వారికి ఆరోగ్యవంతమైన వినోదాన్ని కల్గించాలి.

పిల్లలు నేరాలు చెయ్యకుండా చేయాలి; తప్పుడు దారులుతొక్కే పిల్లలకు పునర్విద్యాబోధన సాగించాలి.

వలస అస్వతంత్ర దేశాలలో దిక్కూమొక్కూలేని పిల్లల సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నించాలి.

పిల్లల వెట్టిచాకిరీ నిర్మూలనకు ప్రయత్నించాలి; ఈ విషయమై న్యాయచట్టాలలో అభివృద్ధికి పాటుబడాలి.

ప్రజాస్వామిక భావాలతో, దేశాలమధ్య స్నేహభావాలతో పిల్లలకు విద్యాబుద్ధులు గరపాలి.

పిల్లల శ్రేయస్సుపట్ల శ్రద్ధ వహించే వారందరి సమిష్టి కృషివల్లనే పిల్లలకు శాంతియుతమైన ప్రపంచంలో ఆరోగ్యవంతమైన చురుకైన జీవితం లభించగలదు.

అంతర్జాతీయ పిల్లల రక్షణ మహాసభకు చెందిన అంతర్జాతీయ పోషణ సంఘం సభ్యుల లిస్టు ప్యారిస్ లో ప్రచురించబడింది. ఈ సంఘంలో 38 దేశాల ప్రతినిధులున్నారు; దీనిలో ప్రఖ్యాత విద్యావేత్తలు, డాక్టర్లు, రచయితలు, ప్రజానాయకులు మొదలైనవారు సభ్యులుగానున్నారు. వారిలో, సోవియట్ శాస్త్రవిజ్ఞాన పరిషత్తు సభ్యుడు ప్రొఫెసర్ స్పెరాన్ స్కీ, చైనానుండి మేడమ్ సుంగ్ చింగ్ లింగ్, ఫ్రాంసునుండి యూజిని కాటన్, అమెరికానుండి ప్రొఫెసర్ వాట్ సన్, పోలెండ్ నుండి జూలియన్ ట్యూవిమ్, ఇండియానుండి డాక్టర్ కిరోడ్ చౌదరీ, చిలీనుండి గేబ్రియాలా మిస్ట్రాల్, ఫ్రెంచి ప్రఖ్యాతనటి ఫ్రాంకోయిస్ రోజ్, ఫిన్ లేండ్ నుండి సిల్ వియా కెక్కోయెనెస్, ఇరాన్ నుండి జనరల్ మహమద్ హుస్సేన్ మిర్జా ఫిరోజ్ మొదలైన వారున్నారు.

('టాస్' నుండి.)



# నేటి యువకుని భావనలో స్త్రీమూర్తి

"శ్రీమతి"

(గతసంచిక తరువాయి)

ఇంటర్ రెండు సంవత్సరము లిట్లే యుండును. తరువాత, వారికి ఓవిధమైన పెద్దమనిషి తరహావచ్చును. విద్యార్థుల ప్రవర్తనయిది. ఇంక సాంసారిక జీవితము లోనున్న కొందరు పురుషుల కంటికొక విద్యార్థిని కనిపించినచాలును. వింతగా, ఏక దీక్షగా, అప్పజెప్పిన అక్షయుగ్మమును క్రిందికిదించిన ఏమియాపద వాటిల్లునో యనునట్లు చూచెదరు. ఈచూపున కంత రార్థమేమో తిరుమలేశ! అంటే, అది అంతా ఆమె ప్రవర్తనపై ఆధారపడి యుండునని పల్కెదరు. ఒకవేళ ఆమె అటు చూడనిచో ముందుకువచ్చి ఆమె ముఖములోనికి తొంగిచూచు వీరశ్రేష్టులును కలరు. గౌరవార్థమామె మాటాడినను, నవ్వినను, ఇంక ఆమె తననువలచి నవరత్నాలు రాల్చినదనియే వారి భావము.

ఇంక, మగపిల్లలుకల తండ్రుల ప్రవర్తన- విద్యార్థినులే పనులుచేసినను వారికంటికి గొప్పదోషముగ కన్పించును. విద్యార్థిని ప్రవర్తన విషయమై ఆమె తలితండ్రులకు బుద్ధులుచెప్ప జూతురు. మరి ఆడబిడ్డలుకల తలితండ్రుల ప్రవర్తన - ఇతరులెవ్వరును, తమ బిడ్డలను కాదని, ఆ విద్యార్థిని, మంచి దనియో, శాంతిమతియనియో, లేక సౌందర్యవతియనియో పొగడిన నింక సహింప జాలరు. లేనిపోని కల్పనల కల్పింపజూతురు. ఆమె పెండ్లిలేమికి కారణములను కల్పింతురు. లేదా, స్త్రీకి, తన శీలమందున్న యభిమానమును తెలసిన ఆ తండ్రి, ఆమె దుశ్శీల యని ఆరోపింపజూచును. ఇట్టివారు న్నారనిన నమ్ముదురా? హృదయ పూర్వకముగా ఆమె అభివృద్ధిని కాంక్షించి సంతోషించు విశాల హృదయులు చాల అరుదు. అట్టి స్త్రీ విద్యా దూషకులు తమ బిడ్డలను మరల అవిద్యార్థిని అడుగు జాడల లోనే నడిపింప జూతురు. ఇట్టిపరిస్థితులలో ఆవిద్యార్థిని కేమి మనోధైర్యముండును? ఒక స్త్రీ గౌరవ మర్యాదలకు, శీలమున కామెయే బాధ్యురాలు కాని ఇంకొక రెప్పటికినికారు. చదువు, స్త్రీలను పాడు చేయునని వారి మొదటివాదన. అదియెన్నటికినికాదు. నేటి విద్యార్థిని అభ్యసించు విద్యకును, జరుగు సంఘటనలకును, ఆమె యొక్క గుణములకు, శీలమునకు సంబంధమే లేకున్నది. ఏనాడు, ఏప్రభుత్వము, స్త్రీకి తగిన శిక్షణాలయములను నెలకొల్పి, తగిన ప్రోత్సాహము నిచ్చిరి గనుక, ఈనాడు అదిలేదని మనము విచారించుటకు? ఉన్నను అట్టినైతిక ధర్మమును, శీలసంపదను

పెంపొందింపజేసి, ఆరితేరిన గృహలక్ష్మిగ చేయు విద్యాసంస్థలు ఎచ్చటనో దేశము మొత్తముపై రెండు మూడు సంస్థలకన్న నెక్కువలేవు. అవి ప్రతిస్త్రీకిని అందుబాటులో లేవు. వారి కందుబాటులో నున్నది కళాశాలలే. ఈ కో ఎడ్యుకేషన్, వారి గృహిణీ జీవితమున కెట్టిశిక్షణయు నీయలేకున్నదనిన అది వారిలోపమా? చదువుకున్న యువతిని మంచి నైతిక మార్గములో పెట్టుటకు తగిన విద్యా సంస్థలను, ఈ స్త్రీ విద్యాదూషకు లేర్పఱచి దేశము నుద్ధరించరాదా? స్త్రీని, ఆమె అభ్యసించిన విద్యను దూషించే కన్న, ఇట్టి విద్యాసంస్థలను స్థాపించిన ఈ మహాశయులు కొంతచేతనైన వారగుదురేమో!

మొత్తముపై అట్టియువకులను, అన్ని తరగతులకు చెందిన యువతులను కూడా సినీమాలు చాలవరకు పాడుచేయుచున్నవనుట నిర్వివాదాంశము. అవి చూచుట వలన ప్రజానీకములో ఎక్కువగా దొంగతనములు, చేతకాని పిరికి ప్రేమకలాపాలు నెలకొల్పబడినవి. ఒకసినీమాలో ఒక ప్రదర్శన జరుగునంతకాలమును, నవీన యువకులంతా [illegible] తోట రాముడో, భలే రాముడో లేక ఖైసో అగుచుందురు. విలాసవతులంతా రాజకుమార్తెలో, లైలాలో అగుచుందురు!

జీవితమెంత హాస్యాస్పదమైనది! కూటికిలేని నిరుపేద మొదలుకొని లక్షాధికారి వరకు అందరూ సినీమాపిచ్చిలోపడి యున్నారు. దేశాభ్యుదయమునకు పనికి వచ్చు చిత్ర మొకటియులేదు. ధనము విలువ తగ్గినది. దానిని వెచ్చించుటకు మంచి మార్గమేమీ లేకపోవుట వలన కాబోలు ఇట్లు వ్యయపఱచుట!

ఈ సినీమాలకు తోడు లైంగిక విజ్ఞానము నభివృద్ధి పఱచు మోహిని, రేరాణి, అభిసారిక మున్నగు పత్రికలు కొన్ని, యౌవ్వన వంతులైన స్త్రీపురుషులకు సహజముగా నెట్లునువచ్చు ఈ విజ్ఞానమును, పుస్తకముల మూలమున తెలియ పఱచుట అనవసరము. అపసవ్యము కూడా. అందును, ఇట్టిపుస్తకములు బాల్యదశలో నున్నవారి చేతులలో కూడా చేరుచున్నవి. చిన్నపిల్లలు తెలిసి తెలియని జ్ఞానముతో నుందురు. అట్టివారీపుస్తకములను చదివిన చెడుపనులనే వారు గ్రహించగలరు కాని మంచిని గ్రహింపజాలని స్థితిలోనుందురు. వీరికేకాదు విద్యార్థి దశలోనున్న యువతీ యువకులకు కూడ ఈ పుస్తకములలోని చిత్రములు, కథలు, లేనిపోని పోసులను కల్పించుచున్నవి. అశాంతి, నిరాశ, ఆకలి మంటలతో అలమటించుచున్న దేశమును పునరుద్ధరించు బాధ్యత నేటి యువకులదే! దేశమునందలి పరిస్థితులను గ్రహించి, తదనుగుణముగ తగిన దేశసేవ చేయవలసిన యువకుడు పైవిధముగ తయారగుచున్నాడంటే దేశమెట్లుండును?

వీనివలన కొందరు ధనవంతు లగుచున్నమాట నిజమే. కాని నిష్కళంక

మైన భారతదేశపు ఔన్నత్యమును, సాంప్రదాయములను, ఈ చిత్రములు, పుస్తకములు కొంత అడుగంట చేయుచున్న వనుట నిజము. ఇటువంటి విషయములలో వ్యతిరేకముగా వాదించువారు చాలమంది కలరు. "అట్టి పుస్తకములను చదవకూడ దనుటలో అర్థము లేదు" అనువారు "చూచినంత మాత్రమున, చదివినంత మాత్రమున చెడిపోయెదరనుట వట్టిభ్రమ" అనువారును చాలమంది కలరు. అందును కొందరి భావమేమంటే, "మానవునకు ఆకలి, దప్పి కలిగినప్పుడు అన్నము, నీరు ఎంత అవసరమో, పురుషునకు కామతృష్ణ కలిగినప్పుడు, స్త్రీకూడ అంత అవసరమని, అందుచే, ఏ స్త్రీని ఎచ్చట పొందగోరిన, అచ్చట పొందుటలో తప్పులేదని."

కాని దేనికైనను ఒకనీతి, నియమము అనునవి యున్నవి. పూర్వులు మనకన్న తెలివైనవారు గనుకనే ప్రతివిషయమునను ఒకనియమమును పాటించెడివారు. ఇంద్రియ నిగ్రహము కలవారంతా బ్రహ్మచర్యమును స్వీకరించి తదనుగుణమైన వర్తనలో నుండెడివారు, తక్కిన వారికి బాల్య వివాహములు చేసెడివారు. అట్టి ఆకలి సమయములలో, అగ్నిసాక్షిగా పెండ్లాడిన స్త్రీని పొందుటలో తప్పులేదు కాని, !కనిపించిన యువతినల్లా పొంద గోరుటలో అర్థములేదేమో! ఇంక, మానవ జాతికి మంచిని గ్రహించుటలోకంటే చెడ్డను గ్రహించుటలో శరవేగమైన తెలివితేటల నుపయోగించుటయే లక్షణమై యున్నదేమో యనిపించుచున్నది. అందుచేతనే సాధ్యమైనంతవరకు మానవజాతికి మొత్తముపై కలిగించు నష్టములను తొలగింప వలసిన బాధ్యత మనదేకదా!

యువకవర్గమంతా చెడుగుణములు కల వారని నేననజాలను; అనలేను. కాని, నేటి యువకవర్గముయొక్క భావము లిట్లే యుండునేమో! లేక నేను నివసించు పరిసరములకు చెందిన యువకవర్గముయొక్క భావము లివియేమో! ఇవి అన్నియు పిచ్చివ్రాతలవలె వారికి గోచరించును. మరి మీకెట్లు గోచరించుచున్నవో నాభావములు!

స్త్రీలోకూడా లోపములు లేకపోలేదు. పనిలేని మధ్యాహ్న సమయములందు గృహాలంకరణ నిమిత్తమై చిన్నచిన్న కర్టెన్లు, తలగడ గలీబులు, మున్నగునవి తయారు చేయుచుండిన కొంత కాలయాపనయగును. లేనిచో ఇరుగు పొరుగులతో తగవులకుదిగు పరిస్థితు లేర్పడుచుండును. అదియేమి ఖర్మమోకాని ఖరనామ సంవత్సర ప్రారంభమునుండియు అందరి బుద్ధులు ఒక్కవిధముగనే ఖరబుద్ధిగా మారుచున్నది! ఇరుగు పొరుగుల తగవులలో స్త్రీలే ముఖ్యపాత్రవంతులు బాధ్యులుగానున్నారు. అందుచే పురుషుల భావనలోవారు గయ్యాళులుకాక, ఆదర్శప్రాయులెట్లగుదురు? ఇటువంటి సమస్యలలో స్త్రీ జాగ్రత్తగ మెలగిన మంచిదేమో!

(సశేషము)

# ★ సారంలేని 'సంకర' సంగీతం ★

శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రి

ధ్వనిమయ జగత్తులోనుంచి వేదలంటూ వినబడ్డ తరువాతనే అన్నివిధాలైన విద్యలూ, కళలూ వెల్లివిరిశాయి. అనంతమైన యీ వ్యాప్తినిబట్టీ భూతభవిష్యద్వర్తమాన కాలాల్లో పుట్టినవీ, పుట్టనున్నవీ అలా వినబడ్డ వానిలో సమన్వయింపబడుతూ ఉండటాన్నిబట్టీ, యింకా అన్నివిధాలైన మంత్రాలనీ, తంత్రాలనీ తనలో నిముడ్చుకొని సముద్రాలవలె సమత్వాన్ని ప్రకటించడం బట్టీ, వేదాలంటే అన్ని దేశాలలోనూ ఎంత గౌరవమైనా ఉంటుంది. అల్లాటి వేదాలుకూడా ముఖ్యంగా సంగీతముమీద ఆధారపడి వున్నాయని మనం నిర్ణయించుకో వచ్చేటప్పటికి సంగీతముమీద మనకు కలిగే భక్తిగౌరవాలు ఎంతవ్రాస్తే తరుగుతాయి?

వేదమంతా స్వరమయమైందే. స్వరంలేకపోతే వేదమేలేదు. మహత్తరమైన వేదార్థం నిర్ణయింపబడాలసివచ్చినా, ఛాత్రకోటికి ఉపదేశింపవలసివచ్చినా, సులభంగా వానిని కంఠస్థాలు చేసుకోవలసివచ్చినా, శ్రోతల శ్రవణాలని సుఖపెట్టుమూలంగా హృదయాలని కరిగించవలసివచ్చినా, దేవతలను సహితము ప్రసన్నపరచుకోవలసి వచ్చినా, చివరకు సాయుజ్యమును సంపాదించనెంచినా యీ స్వరమే ప్రధానసాధనంగా ఉంటోంది. ఆవిధమైన పవిత్రస్వరమును ఆలాపించేవారు వారి వారి సంస్కారాన్నిబట్టీ, కంఠ సారళ్యాన్నిబట్టీ, నిష్కళంక భక్తిపారవశ్యాన్నిబట్టీ, నిఖిలలోక పూజ్యులవటమే కాకుండా దేశజులందరిచేత దేవతాసదృశులుగా భావింపబడుతూ వుంటారు.

వేదస్వరం ఉదాత్త, అనుదాత్త స్వరితము అనబడే మూడుఅరల్లో అణగి మణగి ఉంటుంది. ఏ అరలో ఉండవలసిన స్వరం ఆ అరలో ఉంటూ, అనుగమిస్తూన్నప్పుడే, తన్మయమైన వేదార్థము వినవేడుక నింపుతుంది. ఆలక్షణము ఏమాత్రం తప్పినా వినటానికి వినుగు నింపుతుంది. విపరీతార్థాన్నికూడా కలిగిస్తుంది. ఇల్లాగే ఆ స్వరాన్ని ఉచ్చరించేటప్పుడుకూడా ఎక్కడ ఎంత ఊత యివ్వవలసి ఉంటుందో మిక్కిలి నేర్పుతో కనిపెట్టాలని ఉంటుంది. స్పష్టము, స్ఫుటము, శ్రావ్యము. నిర్దుష్టము అయివుండినప్పుడే స్వరము గాని, తన్మయమైన పఠనము గాని, ప్రశస్తి గడిస్తుంది. ఈవిధాలైన నీతినియమాలతో గూడిన స్వరపఠనంలో కనిపించే గమనాలనుబట్టీ, అందాలనుబట్టీ, రుచులనుబట్టీ, ప్రయోజనాలనుబట్టీ, యిటీవల శాస్త్రజ్ఞులు సాగరసదృశమైన సంగీతస్వరూపాన్ని ఏర్పర్చారు

## సంగీతము - శాస్త్రము

సంగీతమంటే వాఙ్మయసృష్టికి పూర్వస్థమైన ధ్వనిమయప్రకృతిగా భావించవలసి ఉంటుంది. తత్ప్రకృతి ప్రసిద్ధులైన నారద తుంబురాది మహాభక్తుల మనోల్లాసాలు వారి ఆలాపనాలందంతట ప్రసన్నమగుతూ ఉంటాయి. నిష్కాముక నిరంతన తపశ్శీలురుగా పరిగణింపబడే ఆమహర్షుల మనస్సు, వాక్కు, క్రియలు, సర్వము ఆ విధమైన ధ్వనిమయ బ్రహ్మనుభూతికి పవిత్రాశయములై ఉంటాయి. లోకోత్తర నాద బ్రహ్మానందదాయకమైన వారి యాత్మోల్లాసమే యిటీవలి శాస్త్రజ్ఞులచేత "మార్గ" మని పేర్కొనబడుచున్నది. సామగానము లేక వేదగానము మొదలైన పర్యాయపదాలలో వ్యవహరింపబడేదికూడా ఆ మార్గానికి కొంచెము తగ్గునదిగానే యెంచవలసి ఉంటుంది. ఈ అవస్థయందే అసలైనసారము కంటుపడినట్లు మనకు నిశ్చయము గాక తప్పదు.

శాస్త్రము సర్వజన సౌలభ్యంకొరకు లక్షణజ్ఞులచేత ఏర్పర్చబడిందిగా ఉంటుంది. లోకానికి మాత్రమే చెందినదిగా ఉంటుంది.. కల్పితములైన సరళీలు మొదలగు వాని సాధనలు, తప్పొప్పుల విచారణలు, యింకా పల్లవులు, పాఠ్యములు మొదలైనవన్నికూడా యీ తరగతి సంగీతానికి చెందినవై

శాస్త్రజ్ఞులవల్ల సూత్రాలనబడే ఒక కొన్ని నిబంధనాలలో బంధింపబడిఉంటుంది. సూత్రబద్ధమైనదీ, దేశకాలపాత్రాల్లో వ్యవహరింపబడేదీ, తాత్కాలికమైన యెత్కించిదానందాన్ని మాత్రమే యిచ్చేదీ, అయిన యీసంగీతాన్నే శాస్త్రజ్ఞులు "దేశ్యం" అని అంటారు.

## స్వరాలు - సరళీలు

సంగీతము ముఖ్యంగా ధ్వనిమయ స్వరూపాన్ని కలది. ఇదిగాక మనఃప్రేరితమైన వాయ్వగ్ని సంభూతమైనది. కాబట్టే దీని నాదము 'ఆహత' మనిపించుకుంటూంది. లోకంలో యిది బహుళమైన వ్యాప్తిని పొందాలనన్నా, ఆనందాలను యియ్యాలనన్నా, భాషావిషయంలో లిపివలెనే యీ ధ్వనిమయ సంగీతములోకూడా ఒక లిపి ఉండాలిసి వుంటుంది. అదే స్వరసంజ్ఞ ప్రయోజనమని ముఖ్యంగా మనం నిర్ణయించుకోవాలి. సప్తస్వరాలు, శుద్ధస్వరాలు, వికృతిస్వరాలు, హెచ్చు స్వరాలు, తగ్గుస్వరాలు, జంటస్వరాలు, మొదలైనవన్నీ ప్రధానమైన ధ్వన్యంతరాలని తెలుసుకోటానికి, తెలుసుకొన్నవిధంగా కంఠంలో కుదుర్చుకోటానికి, సాధనాలుగా వుంటాయి.

సరళీలు అనబడేవి ఒకవిధమైన క్రమంలో విద్యార్థిజన సౌలభ్యంకొరకు శాస్త్రజ్ఞులచేత కల్పింపబడినవే. విడివిడి స్వరాల స్థానాలన్నీ హృదయస్థములైన తరువాత నేలంటువదలిన పసిపిల్లలకు రెండు, మూడు, నాల్గు, అయిదారక్షరాల పేరు యేర్పడ్డట్లు కొన్ని కొన్ని స్వరాలనుచేర్చి తెలివితేటలు కుదిరేటందుకు యింకా ఒకానొక రాగలక్షణాన్ని పాటించేపద్ధతిలో ఒకింత ప్రవేశం కల్గించుకోటానికి వీలుగానుండేటట్లు, "గీతాలు" అనే వానినిగూడా శాస్త్రజ్ఞులే అల్లారు. ఈలాగే అనేక విధాలైన సంగీతానుభవాలు, స్వాతంత్ర్యాలు విద్యార్థులలో పెంపొందటానికని వర్ణాలు, అలంకారాలు, జతులు, మూర్ఛనలు, పల్లవులు, పాటలు, తానాలు, పదాలు, కృతులు, రాగాలు అంటూ ఎన్నెన్నో దారులు ఏర్పడ్డాయి.

అలంకారాలు ముఖ్యంగా తాళస్వరూపాలను ఏర్పరుస్తూంటాయి. ఇవిగూడ స్వరాలకువలెనే ఏడు ప్రధాన విధానాలుగా ఉంటాయి. ఇందులో ఒక్కొక్క తాళము అయిదేసిదారులలో నడుస్తూ ఉంటుంది. కాబట్టే ఏడు అయిదులు ముప్పదిఅయిదు తాళాలుగ విభజింప బడ్డాయి. వీని గమనాన్ని దృతం, అనుదృతం, లఘు అనేవి శాసిస్తూ ఉంటాయి. కాకపాదం, ప్లుతం, గురు మొదలైనవి మరికొన్నికూడా యీలాగే చేస్తాయిగాని అవి అంతగా ఆచారంలో కనిపిస్తూఉండవు. మొత్తానికి ధ్వనిమయాలై యీ తాళ భేదాలుకూడా స్వర సహాయంవల్ల మిక్కిలి సాధింపబడితేనేగాని అనుకున్నవిధంగా నోటితో పాడటానికిగాని, చేతితో వేసికోటానికిగాని సాధ్యంగాదు. అలంకారాల ప్రయోజనం యీవిధమైన తాళజ్ఞాన ప్రదానంకంటె మరియొకటిలేదని తెలిసికోవలసి ఉంటుంది.

## పదాలు - పాటలు

ఈశీర్షికలో భాషాప్రధానాలైన గీతికా కల్పనాలన్నీ చేర్పబడతాయి. సింహపురి జావళీలు, మువ్వగోపాల పదాలు, త్యాగరాయాదుల కృతులు, యింకా అష్టపదులు, చివరకు యాలపాటలు, యింకోవిధంగా యీ కంపెనీమట్లు మొదలైనవన్నీ కూడా యీ తరగతిలో చేరకతప్పదు. దీనికి కారణం యివన్నీ భాషాప్రధానము లవటంచేతనే. అయితే సంగీత ప్రాధాన్యాన్నిబట్టి కృతులు కొంత ప్రత్యేకత్వాన్ని, గౌరవాన్ని కలిగివుంటాయని చెప్పక తప్పదు. వాని తరువాత మువ్వగోపాల పదాలుకూడ అలాటి గౌరవాన్నే కలిగివుంటాయి. అష్టపదులు మున్నైన వానికంతా అర్థాతిశయాన్ని బట్టి, మర్యాద వుంటూంటుంది. యాలపాటలలో జాతీయము యెంతగా రసజ్ఞులని రంజింప చేస్తుందో, కంపెనీ పాటలలోని పద్ధతి ప్రాగల్భ్యంకూడా అంతగానే శ్రోతల నలరిస్తుంది. కొన్నిటిలో సంగీతము, కొన్నిటిలో జాతీయము, కొన్నిటిలో శృంగారము, కొన్నిటిలో ఆత్మబోధము, కొన్నిటిలో భావలాలిత్యము, కొన్నిటిలో గమనచాతుర్యము, కొన్నిటిలో తాళప్రౌఢి మొదలయిన సంపదలు సరసుల్ని సమ్మో

హనం చేస్తూవుంటాయి. ఈసత్యాన్ని కాదనడానికి ఎవరికి శక్యమౌతుంది?

### రాగాలు - పల్లవులు

సరళీలు మొదలుకొని కృతిపర్యంతాలైన వివిధ పాఠ్యాల్ని చిరకాలము అనుభవించటం మూలంగాను, తల్లక్షణానేకాన్ని పరిశ్రమించటం కారణంగాను, పండితులనిపించుకొనేవారి హృదయాలలో ఘనీభవించేదే రాగజ్ఞానము. అది చిత్ర విచిత్రాలైన అవస్థాభేదాల్ని యెన్నిటినో క్రుమ్మరిస్తుంది. ధ్వన్యంతర సంయోగ వియోగాలు, అపూర్వారోహణావరోహణాలు, కల్పనాలు, స్ఫుటాస్ఫుట స్వరాలాపాలు, తత్సంబంధి గాంభీర్య లాలిత్యాలు మొదలైన సంచారభావ సౌందర్యాలు సమగ్రంగా సంఘీభవిస్తూ గాయక మనోగతస్థాయ్యర్థాలని అమూలాగ్రము రసమయం చేసేస్తూంటాయి.

రాగాలాపనంలో శబ్దాలులేవు. సమాసాలులేవు. ఇంకేవిధమైన భాషాలంకారాలులేవు. ఆద్యంతం ధ్వనిమయంతప్ప యింకోటిలేదు. ఈలాటి ధ్వని మాత్రంచేత సర్వజనుల్ని ఆనందసాగరంలో ముంచేసే రంజనశక్తి సంగీతంలో మినహాయింప బడ్డప్పుడు సంగీతమనేదాంట్లో శబ్దము మాత్రమే మిగిలింది. ఈనిజాన్ని చెపితే నిష్టూర్యం అవుతుంది.

“పల్లవి” అనేదానికి మనవారొక విపరీత సాంప్రదాయాన్ని సమకూర్చారు. కాబట్టే ఏసభలో చూచినా యీభాగము కసరత్తుగా కనుపిస్తూ వుంటుంది. ధ్వని ప్రధానమైన రాగాలాపనానికి తోడుగా తదనుగుణ్యమైన తాళమనేది ఒకటి దీనిలో అధికంగా పరిక్రమిస్తూ యుంటుంది. సనాతన సాంప్రదాయాన్నిబట్టి చూచినా, బుద్ధి విశేషాన్నిబట్టి యోచించినా, యీ తాళమైనా రాగార్థ భావాలకు రమణీయతను సమకూర్చే కార్యాన్ని కలదిగా స్పష్టమవుతుంది. గూఢంగాను, సరళంగాను, సరసంగాను ప్రధానార్థమైన రాగార్థాన్ని అనునయించటానికి బదులు అనుశాసించటానికి యెప్పుడైతే ప్రారంభమవుతుందో, అప్పుడే మద్దెలతో గుద్దులాట, ఫిడేలుతో పీకులాట, స్వరాలతో సాగులాట, సంభవింపక తప్పదు. ఈసత్యాన్ని మన సంగీతలోకం ఒప్పుకొనేవరకుకూడా పైని చెప్పిన సంగీతంలో శబ్దము మాత్రము మిగలక తప్పదు.

### సంకర సంగీతము

పరమపవిత్రమైన త్యాగరాయ కృతులన్నీ అచ్చు పుస్తకాల్లో వున్నాయి. కాని శిష్యపరంపరంగా వచ్చిన యథార్థపాఠ్యాలు యెక్కడాలేవు. తదితరాలలో దీక్షితులవారివి, మరొకరిద్దరివి గాక మిగిలేవానికి అంతగా ప్రామాణ్యం యెన్ని సందర్భాల్లో యెంతవరకుంటుందో పెద్ద అనుమానం. ఇక యీపాఠ్య భేదాలుకూడా దాక్షిణాత్యుల కచ్చేరీలలో కొన్ని వికారాలనుకలిగి కనిపిస్తాయి. ఆంధ్రులలో మరికొన్ని పరమఛాందస స్వరూపాలు సాక్షాత్కరిస్తాయి. ఈ విధమైన యెన్నెన్నో వికారాలు లకారాలుగా మారిమారి, మనదేశపు మంగళ్ళలో చివరకు మండిపోతున్నాయి. ఇక యింటింట ఆదొక నవ్యనాగరికంగా వెల్లివిరిసిన హార్మోని అభ్యాసాల్లో అసలు తాళాలే తాకట్టయి పోయినవి. పైగా బ్యాండు బయలుదేరి యీ అమాంగళ్యాన్నే బావురుమంటున్నాయి. ఇక మేళాలసంగతి కేమిటిలెండి. దైవానుగ్రహంవల్ల యిప్పుడు అమలులోలేవు గనుక ఒకవిధంగా వదిలి వేయవచ్చు. ఇవన్నీ యిట్లావుంటే ప్రస్తుత కంపెనీలలో ఏదో సంగీతం కాలిపోతుందని మనపెద్దలు బహు దీర్ఘవ్యాఖ్యానాలు చేస్తారు. అదేమిటో ఊహించలేము. గొంగళిలో వెంట్రుకలు ఏరడంగా ఉంటుంది, యీ విధమైన విమర్శనము. ఒకచోట కాదు, ఎక్కడచూచినా సంకర సంగీతమే.



# అంగనలు ఆరోగ్యంగా వుండని కారణాలు!

చిత్తమందున రేబవల్ చింతగున్న
మగువకాయంబు నిస్తేజమగుట నిజము;
మోము ముకుళితకుసుమమై మోజుతొలగు
అవయవంబుల చురుకంత అణగుచుండ!

మనసు క్రోధానలంబున క్రుగ్గుచున్న
కోమలాంగుల సౌందర్య కొరత హెచ్చు
రూపలావణ్య తత్వాలు రూపుమాయు
నీరుదిగజారి తేజస్సు నీరసించు!

క్రోధమే స్వాభావమైనట్టి కోమలాంగి
బక్కచిక్కును, బొమికలు బయటబడును
చిర్రుబుర్రుల పిల్లలచిదుకగొట్టు
పల్కగారాని పలుకులు పతినిపలుకు
మానసిక దుర్బలత్వంపు మహిమజాటు!

కొలుపోదురు రక్తంబు కోపమున్న
ఆరగించిన నాహారమరగ దెపుడు
జీర్ణకోశము క్షీణించి - జీవితంబె
అందునిందునుగాకండ - ఆరిపోను!

భావపావిత్రతే కొంత భగ్నమవగ
మనసు చీకాకుజెందును మగువకెపుడు
మానమర్యాదలెరుగక మాటలాడు
తప్పు తగదను భావంబు తలపులేక!

గాలివెల్తురు సోకని గదుల నుండు
సుందరాంగులు...సౌందర్య సోభదక్క
సహజ లావణ్య కాంతులు సన్నగిల్లి
ప్రేతకళ చూపురిస్తుందు పెందలకడ!

మలయమారుతమందున మసలకున్న
బాలభాస్కరు కాంతులు బడయకున్న
అతిప్రశాంతము మదికింత అందకున్న
అంగనల మోముపైనెట్లు అందముండు!

శుద్ధవాయువు తగినంత శూర్యరశ్మి
తగువిధంబగు శ్రమయును...తప్ప కెపుడు
అందగత్తెల కాయాల కందుచున్న
రంగు బంగారు కాంతుల రాణహెచ్చు!

నడకసాగించి....మనసార నవ్వునారి
అవయవంబుల చైతన్య మంకురించు;
కాయమందెంతయో శక్తి కదలబారు;
వదనమంది వికసించును వనజమోలె!

వల్లభనేని రంగాదేవి.

---

## బిల్వ, వేప

బిల్వ, వేప అను జాతీయమూలికలనుగూర్చి శాస్త్రవిషయక పరిశ్రమచేసి వ్రాయబడిన ఉత్తమ గ్రంధరాజములు. ఈ మూలికల ఓషధిగుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణ వివరము, సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంధములు. క్రౌనుసైజున మంచి ఫెదరువైటు కాగితములమీద ముద్రింపబడి గృహలక్ష్మి గ్రంధమాలలో ద్వితీయ తృతీయ కుసుమములుగా ప్రచురింపబడినవి.

గ్రంధకర్త : కే. యస్. కేసరి — ప్రతి 1-కి 0-12-0

గృహలక్ష్మి కార్యాలయము, రాయపేట :: మద్రాసు.

---

# శ్రీ దేవి

**శ్రీమతి శారద సరోజినీదేవి**

"ఆరోజున అకస్మాత్తుగా జ్ఞాపకంవచ్చింది శ్రీ. ఇంక పనేమీ సాగలేదు. వ్రాస్తూన్న కాగితాలన్నీ అలాగేవదలి కుర్చీలోజార్లపడి కళ్లుమూసుకున్న కళ్ల ఎదుట నవ్వుతూనిల్చున్నట్లేవుంది నా శ్రీ. ఆఫీసులో వుండబుద్ధిపుట్టలేదు. సైకలుతీసుకొని జవానునైనా పిలవకుండగా ఇంటికివచ్చా, నా పెట్టెలో జాగ్రత్తగా పట్టురుమాలలో కట్టియుంచిన ఫోటోతీసి చూస్తూవుండిపోయాను, కళ్లునీళ్లతో నిండిపోయాయి. శ్రీ. జాతకము, చెయ్యిచూచిన జ్యోతిష్కులందరు ఎంతో అదృష్టవంతురాలని, గొప్పది అవుతుందని ఎన్నో చెప్పారు. కాని ఏదినిజంగా ఆపాపం అంతా నాదే అనిపిస్తుంది. ఎంతద్రోహం చేశాను. శ్రీ నీకు! అయ్యో నేను ఎంత దుర్మార్గుణ్ణి ఎంతపిరికివాణ్ణి! తెగించలేకపోయాను. నీజీవితం పాడుచేశాను. శ్రీ నన్ను నువ్వు ఎంతనిందించావో, ఎంతవిచారించావో, నాలాంటి నిర్భాగ్యుడికి నీలాంటి మణి దక్కకూడదని భగవంతుడు ఇలాచేశాడు. నేను దరిద్రుణ్ణి నీలాంటి శ్రీదేవి నాదగ్గర ఎలాగుంటుంది. అందుకనే నన్నువిడచి వెళ్లిపోయావు. శ్రీ అయ్యో ఇంక ఎక్కడ శ్రీ. నన్నువదలి అప్పుడే 2 సంవత్సరాలైపోయాయి. ఈ పది, పండ్రెండు నెల్లనుంచి నీజ్ఞప్తిలేకుండ ఈ సంసారకూపంలో పడిపోయాను. నీకు కోపంవచ్చిందా? కాని నామీద నీకు కోపం వుండదు. అలాకోపంవుంటే ఇలానవ్వుతూ నాదగ్గరకు రానేరావు. నాకోసం నీప్రాణాన్నికూడ ఇచ్చావు. అయ్యో నా శ్రీ ఇంకనువ్వులేవు. ఈనీచుడుమాత్రం జీవచ్ఛవంలాగ ఉన్నాడు. కళ్ళనీళ్లు విపరీతంగా వస్తున్నాయి. అలాగే ఈజీచైరులో కళ్లు మూసుకొని ఫోటో గుండెలమీద పెట్టుకొని పడుకొన్నాను. "అయ్యో అదేమిటండీ అలా కళ్ళనీళ్లు కారుస్తూ పడుకొన్నారు," అంటూ నాకళ్లనీళ్లు తుడుస్తూ నాచేతిలోవున్న ఫోటోతీసింది మాఆవిడ. నేనేమి మాట్లాడకుండా అలాగే కూర్చున్నాను. "ఎవరండీ ఈఫోటో" అంటూ వెనక్కుత్రిప్పి పేరు చదివి "ఓ.హో శ్రీదేవిఅంటే ఈమేనా ఇన్నాళ్ళనుంచి నాకు చూపించకుండగా దాచిపెట్టారా?" నేనేమి మాట్లాడలేదు. 'ఏమవుతుందండీ మీకు.' నేను ఆమె ముఖంలోకిచూస్తూ "ఆమెనాకు ఏమవుతుందో చెప్పలేనుకాని నేనుమాత్రం ఆమెకు మృత్యుదేవతనయాను పద్మా అన్నా" విచారంగా. "ఎందుకండీ అలా అనుకుంటారు; అసలుసంగతిఏమిటో నాకు చెప్పండి." "ఏంచెప్పమంటావు. చెప్పాల్సివస్తే నేను దుర్మార్గుణ్ణి; ఒక అమాయకురాలిప్రాణంతీసిన పాపాత్ముణ్ణి అని చెప్పాలి.' "అదుగో మళ్లీ ఆమాటేనా. ఎందుకు మిమ్మలని మీరు అలా తిట్టుకుంటారు. మీవాళ్లందరు శ్రీదేవిని మీగురించి ఏమో చెప్పుకుంటూనేవుంటారు. నాకేమి తెలియలేదు. మిమ్మలిని అడుగుదామంటే భయంతో వూరుకొన్నాను. కాని ఇంక ఈరోజు చెప్పకతప్పదు" అంది పద్మ పట్టుదలతో "అలాగేచెపతాను పద్మా" అన్నా కళ్లుతుడుచుకుంటూ. "తన చేతిలో ఫోటో స్టూలుమీద పెట్టి" ఉండండి కఫీ తీసుకొస్తాను" అని లోపలకి వెళ్ళింది.

"నేను శ్రీదేవి చిన్నప్పటినుంచీ అంటే జ్ఞానం తెల్సినదగ్గరనుంచీ ఒకచోట పెరిగాము. ఒక్కస్కూలులోనే చదివేవారం. నాకన్న శ్రీ అయిదు సంవత్సరాలు చిన్న. మా బంధువులందరూ శ్రీని నాకిచ్చి పెళ్ళిచేయాలనుకునేవారు. మేమిద్దరం దెబ్బలాడుకొనేవారం, ఆడుకునేవారం, ఒకచోటే కూర్చుని చదువుకొనేవారం, చాల స్నేహంగా, ప్రేమగా నుండేవాళ్ళం. కాని భార్యాభర్తలంటే ఏమిటో తెలియదు. ఎప్పుడయినా శ్రీమీద కోపం వస్తే నిన్ను పెళ్ళిచేసుకోనని బెదరించేవాడ్ని. దాంతో ఏడుస్తూ వాళ్ల అమ్మతో ఫిర్యాదుచేసేది. వాళ్లు ఆ ఎందుకు చేసుకోడు కాళ్లుచేతులుకట్టి నీపక్కన కూర్చోపెట్టి పెళ్ళిచేస్తాము. అనేవారు. మా నాన్నగారు ఎప్పుడయినావసే శ్రీ వాళ్ల అమ్మ చూడు వీళ్ళిద్దరకూ పెళ్ళిచేస్తే బాగుంటుంది అనేది. మేమిద్దరము ఒక్కచోట కూర్చుని చదువుకొంటూ

వుంటే చూడు భార్యాభర్తలిద్దరూ ఒక చోట కూర్చుని చదువుకుంటున్నారు అని మా నాన్నగారితో వాళ్లఅమ్మ అనేది. కాని ఆయన "చిన్నప్పుడు అలా అనకూడదమ్మా" అనేవారు. ఆయన మనస్సులో ఇంత విషముందని ఎవరికి తెల్సును.

ఎస్. ఎస్. ఎల్. సి ప్యాసయినాక నేను ఆ వూరునుంచి వెళ్ళిపోయా. మా నాన్నగారు ఏవో సంబంధాలు తీసుక్కురావడం, నేను పెళ్ళి చేసుకోను అనటం జరిగింది. తిర్గి 2 సంవత్సరాలకు మా బంధువులున్న వూరేవచ్చి కాలేజీలో చేరాను. శ్రీ కూడ పెద్దదయింది. వాళ్లవాళ్లు పెళ్ళిచేస్తానంటే ఏడుపుట. పెళ్ళిచేసుకోను చదువుకుంటాను అనేదట. ఒక రోజున నన్ను పెళ్ళిచేసుకుంటావా అని వాళ్లవాళ్లు అడిగితే ఊ అందిట. నేను అక్కడకు వచ్చాక ఒకరోజున నన్నుపిల్చి పెళ్లివిషయం ఏంచేశావు? మీ నాన్నగారు చాలా సంబంధాలు చూశారు చేసుకోలేదేం? అన్నారు. "నాకుఇంకా చేసుకొనే ఉద్దేశ్యములేదు. అయితే శ్రీకిపెళ్లి ఎప్పుడు" అన్నా నవ్వుతూ ఆమెకేసిచూస్తూ. "అది పెళ్లి చేసుకోదట" అన్నారు. ఆమె కొంచెంసేపు ఈమాట ఆమాటఅయ్యాక శ్రీని నాకివ్వటంవచ్చింది. 'నీఅభిప్రాయం ఏమిట'న్నారు. నేను నవ్వుతూ ఆమెగారు అసలు పెళ్లిచేసుకోదుగా ఇంకనాఅభిప్రాయం ఎందుకు అన్నాను. నీసంగతిచెపుదూ అన్నారు. నేను శ్రీనితప్ప ఇంకఎవ్వరిని చేసుకోతల్చుకోలేదు. అయినా ఆదేవిగారి ఉద్దేశ్యం తెలుసుకోవద్దు అన్నా. చెప్పమ్మా నీ అభిప్రాయం, నిన్ను పెళ్లి చేసుకొంటాడుట, మరి నువ్వుకూడ చెప్పఅన్నారు. ఆమె సిగ్గుతో తలవంచుకొని ఊ అని అవతలకు వెళ్లిపోయింది.

నామనస్సులో ఏలావుండేదో నాకే తెలియదు కాని శ్రీ అంటే మాత్రం ప్రేమగానేవుండేది. కలసి చదువుకొనేవాళ్లం, సినీమాలకు వెళ్లేవాళ్లం, నా పెట్లో డబ్బులుగాని, తినేవస్తువులుగాని తనకి ఏంకావలసినా స్వతంత్రంగా తీసుకొనేది. తనదగ్గర నుంచికూడ నేనుస్వతంత్రముగా తీసుకొనేవాడిని. ఇద్దరం చాల కలసి మెలసి వుండేవాళ్లము. ఇలా ఏవడిదుడుకు లేకుండగా సంవత్సరం గడిచింది. మా నాన్నగారువాళ్లు మాత్రం నామీద శ్రీతల్లితండ్రులమీద, శ్రీమీదకూడ కారాలు మిరియాలు నూరుతున్నారు. నాన్నగారు చాల విషపాలోచన గల మనిషి. అందువల్ల పైకి తేల్చకుండా లోపల్లోపలే వుంచారు. ఎప్పుడయినా చూచాయిగా అంటూ వుండేవారు. నేనుకూడ నా అవసరం తీరడాన్కి వాళ్లింట్లో గడుపుకొంటున్నాను. ఈసంగతులన్నీ శ్రీతల్లి తండ్రులు గ్రహించి కొంచెం ముభావంగానే వుండేవారు. ఆఖరకు అందరిమనస్సులోను తుఫాను రేగింది. నేను ఆ తర్వాత చదువుకి చాల దూరదేశం వెళ్లేను. అక్కడనుంచి ప్రారంభ మయింది నాటకం. నేను నీకు ఫలాన సంబంధము నిశ్చయించాను. ఈశలవ్వులలో నీ పెళ్లిచేసి తీరాలి. నీవు అడ్డు చెప్పటాన్కి వీలులేదు అని మా నాన్నగారు వ్రాశారు. నేను ఇప్పుడు పెళ్లి చేసుకోనని జవాబు వ్రాశాను. దాంతో ఆయన కోపంతో నేచెప్పిన పిల్లను చేసుకోపోతే నీకు నాకు ఏం సంబంధము లేదు. నీవుచచ్చినవాడితో సమానము. నాకుపుట్ట లేదనుకుంటాను. అంటూ నిష్ఠూరంగా వుత్తరాలు వ్రాశారు. నేనుజబాబు వ్రాయలేదు. ఆఖరుకు శ్రీ మీద లేనిపోని అపనిందలువేస్తూ వ్రాశారు. ఆ ఉత్తరాలుచూసి శ్రీ మీదకూడ దురభిప్రాయ పడ్డాను. కాని నామనస్సు పొరపాటుఅనే చెప్పతోంది. నాలోంచి శ్రీ ని వేరుచేయలేక పోతున్నాను. శ్రీ తల్లి దండ్రులు అట్టే భాగ్యవంతులు కారు. అందువల్ల మా నాన్నగారు చెప్పినట్లు కట్నము లేకుండా నాకు అంటకట్టాలని చూస్తున్నారేమోనని నేను దురభిప్రాయపడ్డాను. అందువల్ల నన్ను మాటలుచెప్పి తమ వలలో వేసుకొన్నారు అనుకొన్నాను. ఎన్ని ఆలోచించినా శ్రీ ని మాత్రం నా హృదయంలోంచి తీసివేయలేకుండగానున్నాను. పాపం ఆచిన్న హృదయం, అమాయక శ్రీ అప్పుడు ఎంత బాధపడేదో ఇప్పుడు అనుకుంటే ఏంలాభం? పెద్దలు అన్నీ తెలిసినవాళ్లే అందులో తల్లిదండ్రులే తమ బిడ్డలను ఈలా ఖూనీ చేస్తారంటే ఎవరు నమ్మతారు? మళ్లా మానాన్నగారు ఉత్తరం వ్రాశారు.

నేను స్థిరపరచిన సంబంధము చేసుకోకపోతే దీంతో నీకు నాకుసరి అని. దానిక నేనుజబాబు ఇవ్వలేదు. దాంతో నాకు ఆయన 3, 4 నెలలు డబ్బుపంపడము మానివేశారు. శ్రీని పెండ్లిచేసుకొంటే చదువుకి వాళ్ళనే డబ్బు పంపమని వ్రాయమన్నారు. 4 నెలలు డబ్బులేక చాల ఇబ్బంది పడ్డాను. ఇంక తండ్రికి లొంగక తప్పిందికాదు. నాన్నగారికి ఉత్తరం వ్రాశాను. చెప్పినట్లు వింటాను. మీ ఇష్టమువచ్చిన పిల్లను చేసుకుంటాను. ఇంకా ఏదో నాచేతికి వచ్చినట్లు వ్రాసిపడేశా దాంతో నాకు చదువుకి డబ్బువచ్చింది. పరీక్షలయిపోయాయి. ఇంక యింటికి వెళ్లడమంటే పెద్దనిప్పుగుండంలోకి దూకుతున్నట్లున్నది. ఇంటికి వచ్చినాను మావాళ్లు అందరు చాల సంతోషించారు. ఇంట్లో నన్నుచూసి గుసగుసలు ప్రారంభమయాయి. నేను అంతాకనిపెడుతూనే వున్నాను. ఎప్పుడో వుప్పెన వచ్చిపడుతుందని నామాటలన్నీ జాగ్రత్త చేసుకొంటున్నాను.

ప్రొద్దుట కాఫీ త్రాగుతున్నాను. నాన్నగారు వచ్చి 'అబ్బాయి ఆఫీసుగదిలోకి ఒకసారి రా' అన్నారు. గుండెలు దడదడ మంటూ మెల్లగా వెనకాలేవెళ్లి కుర్చీలో కుర్చున్నాను. చూడు 'త్వరగా డ్రస్సువేసుకో పిల్లను చూచి వద్దువుగాని' అన్నారు. నేను తెల్లపోతూ 'ఏపిల్ల' అన్నాను. ప్రొఫెసర్ గారి అమ్మాయి నేను, అమ్మ, అక్కయ్యలు అందరము చూచివచ్చినాము మాకుపిల్ల నచ్చింది. ఈనెల 15 తా|| ముహూర్తము నిశ్చయించాం, ఆమాటలువినేసరికి నాకు ఒళ్లుమండి పోయింది, 'పెళ్లిచేసుకొని బ్రతికి ఉన్నన్నాళ్లు కష్టసుఖములు అనుభవించేవాడను నేను. ఇదేమన్నా ఆటలా బొమ్మలపెళ్లిచేయటమా' అన్నాను. దాంతో ఆయన తారామండలానికి లేచినారు. ఛీ దుర్మార్గుడా నీముఖం నాకుచూపించకు పోనా యింట్లోంచిపో అంటూ పెద్దపెద్ద కేకలు ఇల్లెగిరి పోయేలాగున వేస్తున్నారు. ఇంట్లో అందరూ మాచుట్టూమూగారు, నేనుమాట్లాడకుండగా తలవంచుకొని కట్టుకొన్న బట్టలతోనే బయటకు వెళ్లిపోయాను. ఏపూరయినా వెళ్లిపోదామని తిన్నగా స్టేషనుదగ్గరకు వెళ్లి కూర్చున్నాను. ఇంతలో మాజవాన్లువచ్చి అమ్మగారు ఏడుస్తున్నారని నన్ను తిరిగి బతిమాలి ఇంటికి తీసుకొచ్చారు. ఏలాగో 15 రోజులు గడిపాను. ఇంతలో ఉద్యోగానికి ఆర్డరు వచ్చింది. బ్రతుకుజీవుడా అని నరకకూపంలోంచి బయటకు పడ్డాను. కాని ఏపండగ శెలవలకయినా యింటికి వెళ్లడం, వెళ్లగానే ఇంట్లో పెండ్లిగొడవ రావడం దాంతో నాకు అక్కడ సుఖం లేకపోవడం ఇలా సంవత్సరము గడిచింది. నాకు మా నాన్నగారు పెండ్లికూతుర్లను చూడడం నేను ఎలాగో తప్పించుకోవడం జరుగుతూ వుండేది. తెగించి శ్రీని చేసుకోలేను; తండ్రిమాట కాదనలేకుండా వున్నాను.

ఆకస్మాత్తుగా శ్రీ దగ్గరనుంచి తనకు జబ్బుగా వుందని ఒక్కసారి రమ్మనమని ఎంతో ప్రాధేయపడుతూ ఉత్తరం వ్రాసింది. దుర్మార్గుణ్ణి వెళ్లి చూడలేకపోయాను. వెళ్లాలని అనుకొన్నానుకాని రాక్షసిలాగ తండ్రి తలపుకువచ్చి ఆ కోర్కె విరమించుకొన్నాను. జబాబు అయినా వ్రాయలేదు. మా నాన్నగారు వచ్చినప్పుడల్లా నాకు బోధచేసేవారు వాళ్లు నిన్ను వలలో వేసుకొన్నారని వాళ్ల మాటలలో పడకని ఏవేవో చెప్పేవారు. అన్నిటికి ఊఁ అనే సమాధానము యిచ్చేవాడిని. ఈ ఉత్తరము అందుకనే ఇలా వ్రాసిందేమో అని అనుకొన్నాను. తండ్రిమాట కాదనలేక శ్రీ దేవిని పెండ్లిచేసుకోలేకపోతున్నాను. పోనీ శ్రీని కాదని తండ్రిమాటవిని ఇంకో పిల్లను చేసుకోలేకపోతున్నాను. ఎటుకాకుండగా కుడితిలోపడ్డ ఎలుకలాగ, కొట్టుకునేవాడిని. సంపాదించుకొంటున్నా సుఖంలేకుండ బాధపడేవాడ్ని. ఆ రోజులు తల్చుకుంటూంటే ఇప్పుడుకూడ దడవస్తూంది.

ఒక రోజున అర్జంటుగా టెలిగ్రాము వచ్చింది. శ్రీ మరణశయ్యమీదవుంది వచ్చిచూడమని. నాకు మతిపోయింది. మా నాన్న చెప్పినట్లు. ఇది దొంగ టెలిగ్రామేమో అనుకొన్నాను. ఆలోచించాను; మతిలేదు; వెళ్లనా-మాననా ఏది తేలకుండగానే మనస్సులోనే బాధపడుతున్నాను. పైకి ఏమ

యినా అంటే మా అక్క చెల్లెళ్లు ఏమయినా అంటారేమో అని భయము. ఇంత పిరికిగుండెవాడ్ని నేనేం చెయ్యగలను చెప్పు? నా పిరికితనమే, నా భయమే శ్రీకి మృత్యువయినాయి. ఇంక చెప్ప లేక వెక్కి, వెక్కి ఆడదానివలె ఏడ్చా. "అయ్యో ఎందుకలా ఏడుస్తారు భగవంతుడు అలా చేశాడు. మీరేం చెయ్యగలరు? ఇంతకు కర్మ" అంటూ తనకళ్ల నీళ్లు తుడుచుకొని నాకళ్లుతుడిచి "ఇంక తర్వాత సంగతి చెప్పండి. ఇంతకు వెళ్లారా? లేదా?" రెండవరోజు మళ్లీ టెలిగ్రామ్. దయచేసి 'ఒక్క సారి రావలెను; అర్జంటు.' ఇంక ఉండలేకపోయాను వెంటనే బయలుదేరి వెళ్లాను.

గుండె దడదడలాడుతూంది. కాళ్లు ఒణుకుతున్నాయి; మెల్లగా లోపలకు వెళ్లేను. ఇల్లంతా నిశ్శబ్దంగావుంది. నాజోడు చప్పుడువిని శ్రీ తల్లి బయటకు వచ్చింది. నన్నుచూచి గుడ్ల నీరు కుక్కుకుంటూ పక్కగదిలోకి వెళ్లమని సౌజ్ఞచేసి వెళ్లిపోయింది. గదిగుమ్మంలోకి వెళ్లేను నాకళ్లను నేను నమ్మలేకపోయా ఏమని చెప్పను పద్మా నా శ్రీ శవాకారంలా మంచంలో పడివుంది. చుట్టూ డాక్టర్లు, ఇంట్లోవాళ్లు నిలుచున్నారు. నన్ను చూడగానే అందరు ఒకరిమొగాలొకరు చూచుకొని అందులో ఒకాయన నన్ను చెయ్యిపట్టుకొని శ్రీ మంచం దగ్గరకు తీసుక్కెళ్లేరు. నావళ్లు నాకు తెలియని పరిస్థితులలోనున్నాను. 'శ్రీ నొక్క సారి పలకరించు నాయనా' అని వాళ్లు అనేవరకు నేను ఈ ప్రపంచకములో పడలేదు. చూడమ్మా శ్రీ మీ ...వచ్చాడు వక్కసారి కళ్లుతెరు. రోజూ అడుగుతున్నావు! అని వాళ్లు ఆమె చెవిలో రెండుమూడు సార్లు చెప్పాక మెల్లిగా కళ్లుతెరిచింది. 'శ్రీచూడు ఇదిగో నేను వచ్చాను, కళ్లుతెరు; మాట్లాడు నాతో ఒక్కసారి' అంటూ కళ్లనీళ్లతో మాట్లాడలేకపోయాను. ఆమె మెల్లిగా నాచేతిని తన చేతిలోకి తీసుక్కొని మంచినీళ్లని సంజ్ఞచేసింది. నేనే రెండు చెంచాలు నోట్లోపోశాను. తన చేతులతో నా కన్నీళ్లుతుడుస్తూ 'అబ్బా ... హా ... ఇన్నాళ్లకు వచ్చావా.. నన్ను ... మర్చిపో ... అమ్మా ఆయాసం...హా... నేను ... వెళ్లి ... పోతున్నా నాతప్పులు ... క్షమించు ... హా ... మీ నాన్న గారు ... చెప్పినపిల్లను ... పెండ్లిచేసుకో...అదే మనసుకు ... శాంతి ... హా ... నిన్నుచూశా ... శలవ్ ... ర్మామా' మాట్లాడలేకపోయింది. ఆయాసంతో బాధపడుతూ కళ్లుమూసుకొంది. ఇంక చెప్పలేకపోయా; చేతిరుమాలు కళ్లకడ్డంపెట్టుకొని వుండిపోయాను. పద్మకూడ ఇంక మాట్లాడలేక వెక్కి, వెక్కి ఏడుస్తూంది. అలా ఎంతసేపు వున్నామో మాకే తెలియదు. ఇంతలో ప్రక్కింటి అక్కగారువచ్చి "ఏంబాబు! ఏమిటి సంగతి; పద్మా అందరు క్షేమంగావున్నారా?" అని పలకరించిన దాకా మాకు తెలివిరాలేదు. పద్మ కళ్లుతుడుచుకుంటూ ఆమెను కూర్చోపెట్టి సంగతిఅంతాచెప్పి ఫోటో చూపించింది. ఆమెకుకూడ కళ్లు నీళ్లతో నిండిపోయాయి. ప్రపంచకములో "ఎంతటివాళ్లయినావున్నారు తల్లీ; నీమామగారు ఎంత దేవాంతకుడో, నిష్కారణంగా ఒక అమాయిక ప్రాణాన్ని తీశాడు. చూడుబాబూ ఎంత సుఖంగావున్నా నీకు కూడ మనస్సులో ఆ బాధ ఒకమూల వుంటూనే వుంటుంది. ప్రపంచకంలో ఎంతమంది ఇటువంటి రాక్షస కృత్యాలకు బలిఅవుతున్నారో? తల్లిదండ్రులే బిడ్డల గొంతుకలు కసాయివాడిలాగ కోస్తున్నారు. మీఇద్దరికి ఇష్టమయినప్పుడు మీ తండ్రి సంతోషంగాచేస్తే ఈ బాధ నీకుండదుకదా? పాపం ఆ పిల్ల తల్లిదండ్రులు ఎంత దుఃఖిస్తూవుంటారో?" అంది ఆవిడ. చూడుపద్మా ఈ కథ ఏ పుస్తకానికయినా పంపిస్తాను. ఏంబాబు ఏమంటావు. "మీఇష్టం అక్కగారూ. ఇటువంటి రాక్షస కృత్యాలు జరగకుండగా నావంటి పిరికివాళ్లు ఎవరయినావుంటే నాకథ చదివాకైనా ధైర్యంగా సంచరిస్తే చాల సంతోషిస్తాను." ఇంక మాట్లాడలేక బయటకు వెళ్లిపోయాను.




శ్రీమతి వల్లభనేని రంగాదేవి

(గత సంచిక తరువాయి)

(ప్రదేశం:- దర్బారు దివాన్ మీర్ చంద్, కాలేఖాన్, భోపత్కర్, మొదలగు సభాసదులు కూర్చుండి యుందురు. "ఝాన్సీరాణీకి జై." అను నినాదములతో రాణి దర్బారులో ప్రవేశించును. అందరూ లేచి మళ్లీ కూర్చుందురు!)

రాణి:- మంత్రులారా! ఉద్యోగులారా! సోదరులారా! నేడు మీముందుకొచ్చినది చెప్పుటకుగాదు; మీరుజెప్పునది వినుటకు. కీర్తిశేషులైన రాజుగారి అనంతరం మీపైనబడ్డవాటితో పాటు నాపైబడ్డ బాధ్యతలుకూడా మీకెరుకే గదా? మనమంతా ఆబాధ్యతల నిర్వహించుటకు - ఆత్మ విశ్వాసంతోనూ, యదార్ధ తత్వంతోనూ - సంసిద్ధమై కూడా యున్నాము. కాని పరిస్థితులు అధ్వాన్నంగావున్నై; కాబట్టి బహు శ్రద్ధగా మెలగవలయును. కొన్నిమాసములు గడచిపోయినై. కాని గవర్నరు జెనరల్ దగ్గరనుంచి అనుమతిరాలేదు. దత్తపుత్రుని యొక్కయూ, రాజ్యము యొక్కయూ భవిష్యత్తు అంధకారమునందున్నది. నిస్సందేహంగా అనుమతి ఆర్డరు వస్తుందని విశ్వాసముంది. అయినప్పటికీ; విశ్వసించవీలులేనట్టి వాయువు చేతనూ, శంకించడానికి అవకాశమిచ్చె మేఘాలచేతనూ, ఆవరించబడ్డ ఆకాశాన్ని చూస్తూంటే - యెప్పుడో ఒకప్పుడు తుఫానుతప్పక వస్తుందనేసందేహం కలుగుతోంది. మన మెక్కియున్న యీ రాజ్యమనే నౌక చిక్కుల్లో తప్పక చిక్కుకుంటుంది. కాబట్టి ముందేమనం సిద్ధమై యుండాలి. భయంకరాంధకార - తుఫానుల్లో - కూడా మార్గప్రదర్శన చేయగల జ్యోతి గావాలి. భయంకరాఘాతాలను కూడా పర్వతాల్లాగా ఢీకొనగలశక్తి కావాలి మనకు. నా యభిప్రాయాలు అర్థం జేసుకొన్నారని ఆశిస్తున్నాను. ఇందుకు మీరెల్లరూ సంసిద్ధులేగదూ?

అందరూ:- మేమన్నివిధములా ఝాన్సీ కొరకు ప్రాణాలర్పించ సింద్ధగానున్నాం.

భోపట్కర్:- దివాను మీర్ చంద్ గార్ని నేనడిగేదేమంటే - గవర్నరు జెనరల్ మహాశయులకు రెండవ పత్రంకూడా

వ్రాసినప్పటికీ; ఇంకా అనుమతి రావ
డంలో ఆలశ్యమెందుకగుచున్నదని ?
యీ విషయంలో మీర్ చంద్ గారే
మైనా ప్రకటించెదరా ? ఇందేమీ హం
బక్ జరగలేదుగదా ?

దివాన్ మీర్చంద్:- అట్టిదేమీ లేదు.
మీయూహలు పొరపాటు. ఆంగ్లప్రభు
త్వమీవ్యవహారంలో నిక్కచ్చిగానుంది.
మనం సందేహించవలసి వచ్చునట్లుగా
ప్రభుత్వం వ్యవహరించదు. ఆలస్యం
జరుగుతోందంటారు ? మరి ప్రభుత్వ
ముతో కూడిన వ్యవహారాలుగదూ...
ఆలస్యమవుతుంది. ముందు వెనకలాలో
చించి కార్యక్రమానికి గడంగడం
వుత్తమమని నాయభిప్రాయం వుత్తమమే
గాదు రాజనీతికూడాను.

భోపట్కర్:- నావుద్దేశ్యంలో; ఇరువైపులా
దృష్టిపుంచి కార్యక్రమానికి గడంగడం
రాజనీతి అనిపించు కుంటుందేమోనని
వుంది. గవర్నరు జనరల్ మహాశయుడు
సమాధాన మివ్వడంలో జరిగే ఆల
శ్యాన్నిబట్టి యిందులో యేదోరహస్య
మున్నట్లుగానేవుంది. ఆసమాధానం మన
పక్షానే వుందనడానికి మీదగ్గరేమైనా
ప్రమాణమున్నదా ?

మీర్ చంద్:-వారి సమాధానం యేదన్నా
గానీయండి గట్టిగా ఆలోచించి సౌమ్యం
గానే యిస్తారన్నదే నావిశ్వాసం. ఇప్పటి
నుంచే - సమాధానం రాకముందు
నుంచే - ఆవేశంలోబడి అలమటించడ
మంత మంచిదిగాదు. విదేశీయుల హృద
యాలు విశాలమైనవి. వాళ్లు చెప్పినదాన్ని
వుల్లంఘించి - మరోవిధంగా చేయరు.

కాలేఖాం:-కాని, దివాన్ గారూ ! యిది
నాకంతగా నచ్చడంలేదు. వాళ్లనర్థంచేసు
కోవడంలో పొరపడ్డారేమోనని ?
నాకూడా వాళ్ల రాజకీయాలు బాగా
అనుభవమే. తమరీ రత్నాన్ని యెంతగా
ప్రశంసించినా, నాకుమాత్రం ఆచమక్
లోపల, రాయేగానవస్తోంది. బహుశా
తమరిటు దృష్టిమరల్చి వుండరనుకుంటా.

మాటలొకవిధి చెప్ప నమ్మానవుండు
చేష్టలొకవిధినుండు - నా - చెనటికెపుడు !
దంతములు రెండువిధము - లా - దంతికెటులో ?
వింత మానవబుద్ధి యీవిధమునుండు !

భోపట్కర్:- కాబట్టి నేజెప్పేదేమంటే -
రాజకీయ వ్యవహారాల్లో ఒకేనిర్ణయం
పైనిలబడి వుండడమనేది బుద్ధితక్కువ
పని అంటాను. మహాభారతములో
కూడా వ్రాసివుంది చూడండి - ఒక
ప్రక్క కృష్ణుడు సంధి రాయభారాలు
నడుపుతూనే వున్నాడు. రెండోవైపున
అర్జనుడు, దుర్యోధనుడు కూడా సైన్య
సమీకరణ చేస్తూనేవున్నారు. ఎందుకు?
సంధి విఫలమైతే -యుద్ధానికి సన్నద్ధ
మవడంకోసం. రాజనీతిఅంటే అదీ.
ఒకవేళ గవర్నరు జెనరల్ గారు అంగీక
రించ లేదనుకోండి....?

మీర్ చంద్:- అసలలా యెందుకనుకోవా
లంటాను ? అనుమాన మనేది రెండు
విధాలా వుంటుంది గదా-అటువంటప్పుడు

దుస్సంకల్పమే యెందుకు సంకల్పించుకోవాలంటాను? నా వుద్దేశ్య ప్రకారం ఆలోచించి అడుగు ముందుకేయడమే రాజనీతి అంటాను.

రాణి:- దివాన్‌గారు చెప్పేది బాగానేవుంది భోపట్కర్ గారు! ఫలితంకోసం నిరీక్షించకే - దుస్సంకల్పమే యెందుకు సంకల్పించుకోవాలి? యీ విదేశ వర్తకులు మోసగాళ్లూ... విశ్వాస ఘాతకులూ - అవుతారని నాకు విశ్వాసంలేదు. ఝాన్సీ ...ఆంగ్లేయుల కెంతో చేసివుంది. కాని దివాన్‌గారు! యీ ఆలస్యానికి కారణమేమై వుంటుంది? వూహా కందడంలేదు.

కాలేఖాం:- ఆజ్ఞ అయితే కొంతవరకువర్ణిస్తాను నేను?

రాణి:- ఆహా; తప్పక చెప్పుము. యేంచెప్పాలనుకుంటున్నావు?

కాలేఖాం:- నేను మేజర్ ఎలిస్‌తో కలుసుకొన్నాను. మాటల సందర్భములో...

ద్వారపాలకుడు:- (నమస్కరించి) మేజర్ ఎలిస్‌గారు దర్బారులోనికి రావడానికి అనుమతికై వేచివున్నారు.

రాణి:- మేజర్ ఎలిస్? రానీయండి (దర్బారు వైపుజూచి) ఇహ మీ తహతహ అధీరత...నాటంతటవే అంతరిస్తై. (ఎలిస్ వచ్చి సలామ్ జేయును) రండి మేజర్ ఎలిస్, మీకొరకే ఎదురుచూస్తున్నాం. గవర్నరు జెనరల్ మహాశయుడు సమాధానమేమైనా పంపించాడా లేదా?

ఎలిస్:- యస్ రాణీసాహేబ్. సమాధానమొచ్చింది. వినిపిస్తా నిదిగో. బట్ ఐ యామ్ సారీ...

అందరూ:- వినిపించాలి, వినిపించాలి.

ఎలిస్:- వినిపిస్తున్నా. ఝాన్సీ మహారాణీ తరఫున దత్తస్వీకారాంగీకారమునకై గవర్నరు జెనరల్‌గారికి దరఖాస్తు పెట్టబడ్డ విషయం తెలిసిందేగదా? దాని మీద కలకత్తా కౌన్సిల్లో విచారణజరిగి తీర్పుకూడా యివ్వబడ్డది. గవర్నరు జెనరల్ గారితరఫున నేను దాన్ని మీకు వినిపిస్తున్నా. ఝాన్సీ పాలకుడు గంగాధర రావుగారు మరణించిరి. ఆయన స్వతంత్ర రాజుగాదు. ఆంగ్లేయులు దయదలచి వారిని తమ సామంతరాజుగా నియమించిరి. బ్రిటిష్ ప్రభుత్వం తన పరిపాలనా కాలములో యే సామంత రాజుకూ దత్త స్వీకారానుమతి యిచ్చియుండలేదు. కాబట్టి వీరికి కూడా దత్త స్వీకారానుమతి యివ్వబడజాలదు. దత్తు రద్దుజేయబడుతోంది. బై ఆర్డర్ ఆఫ్ ట్వంటీ సెవెంత్ మార్చి నైటీన్ ఫిఫ్టీటు చట్ట ప్రకారం ఝాన్సీ రాజ్యం మేజర్ ఎలిస్ (అసిస్టెంట్ పొలిటికల్ యేజంట్ ఆఫ్ బుందేల్ ఖండ్) గారికి స్వాధీనం చేయబడతోంది. ఇహనుంచి యీప్రాంతంపై బ్రిటీష్‌శాసనం అమలునందుండును. ప్రజలెల్లరూ. బ్రిటీష్ ప్రభుత్వ పాలక పౌరులుగా పరిగణింపబడుదురు.

రాణి:-చాలు, చాలు; కట్టిపెట్టండి. ఇహను వినజాలను. హృదయం దహించుక పోతోంది. హా; దౌర్భాగ్యమా! సర్వస్వం హరించినప్పటికీ నీకు సంతృప్తిలేక పోయిందా? అసలా అనుకొన్న కాస్తా కూడా అపహరిస్తున్నావా? ఇంక మిగిలేదే ముంటుంది? కాని; ఇంత జరిగినప్పటికీ వెనుకాడను; చివరి నిట్టూర్పు వరకూ చేస్తాను నీతోయుద్ధం. అబ్బ!

మీర్ చంద్:-నిబ్బరం కలిగి ఉండండి రాణిగారూ.

రాణి:-నిబ్బరం కలిగి వుండాలా? నిబ్బరం కలిగి వుండమంటే అర్థమిదేనా? ఒకరింట్లో పరదేసువులగు దొంగలు బడి దోచుకు పోతుంటే యింటివారు నిబ్బరంగా వుండాలా? వనరాజు గుహాలో నక్కదూరి "నీవు నాబానిసవు" అని అంటుంటే సింహాం నిబ్బరంగా వుండాలా? అసంభవమది. నాకండ్లముందు ఝాన్సీరాజ్యం నాశనమై పోతూంటే నేను నోరెత్తకుండా వుండాలన్న మాట. ఇంకా బ్రతికెందుకు మరి? అయితే ఎలిస్ గారూ! ఝాన్సీరాజు స్వతంత్రుడు గాకుంటే ఝాన్సీ రాజ్యం తెల్లోళ్ల తాతగాడిదా వాళ్లవంశీయు లిక్కడ రాజ్యం జేయడానికి? సప్తసముద్రాలు దాటొచ్చి వ్యాపారమంటూ ప్రాధేయ పడి ప్రాపకం సంపాయించుకొన్న వర్తకులకు పరాయిదేశంలో పరిపాలన సాగించమని మెవరిచ్చారు అధికారం? ఝాన్సీరాజ్యాన్ని బ్రిటిష్ సామ్రాజ్యంలో కలుపుకోవడానికి వాళ్లకెవరిచ్చారు అధికారం? ఇదేనా ఆంగ్ల ప్రభుత్వపు ఆదర్శం? అనాథయగు రాణినుండి రాజ్యాన్ని గుంజి మ్రింగుటలో యీప్రభుత్వానికి సిగ్గు కూడా వేయడం లేదా?

ఎలిస్:-(భయంగా) తమ ఖర్చులన్నీ పొలిటికల్ యేజంట్ చెల్లిస్తుంటాడు. తమ కేవిధమైనట్టి యిబ్బందులూ రాకుండా వుండేలాగు చూ....

రాణి:-(ముఖముటు త్రిప్పి) చాలు, చాలు; మీ ఔదార్యానికి సంతసించాం. కన్నమేసి కలదంతా దోచుకుపోతూ కాసీ చేతులో పెట్టి తన దానశీలత దొంగ ప్రకటించు కున్నట్టుగావుంది యీవ్యవహారం. అట్టి ధర్మాలను దగ్ధపరచ మంటాను నేను. పరదేశ బనియాలు పెట్టు పెట్టెడు మెతుకులకై పుట్టలేదీ ఝాన్సీరాణి. ఝాన్సీరాజ్యం మాదనీ, మాదిగానే వుంటున్నదనీ, ముందు కూడా మాదిగానే వుంటుందనీ నేనంటున్నానని మీ ప్రభుత్వంతో చెప్పుకో-పో (కత్తి ఒరనుండి లాగి)

కత్తికరమున ప్రాణంబు కాయమందు
వెల్లివిరిసిన రోజులె వ్యైతలంలేక
శతృమూకల చెండాడి సాహసముగ
రాజ్యమేలెద ఝాన్సీకి రాణినయ్యా!

సేనాపతీ! (ఎలిస్ తలొంచుకొని వెళ్లి పోవును.)

కాలేఖాం:-(కత్తిపై కిలాగి) అనుజ్ఞ మహా రాణీ!

మీర్ చంద్:-నా వుద్దేశ్యం ప్రకారం వెనుక ముందు లాలోచించి కార్యోన్ముఖులవడమే ...

రాణి:-రాజనీతి అంటావు-అదేనా? ఇహాను మీ రాజనీతిని అలా అట్టే పెట్టండి దివాన్‌గారు. ఎప్పుడూ మన మణిగి వుండి శత్రు పురోగమనానికి సావకాశమివ్వడమే రాజనీతియా? కొంపలంటుకుని కాలిపోతుంటే వింత చూడ్డ మెటువంటి తెలివండీ? శత్రువులు పైనబడుతుంటేకూడా మనం మెదలకండా వుండడమే రాజనీతైతే - అట్టి రాజనీతి కొక నమస్కారం. అట్టిది మనకవసరం లేదుకూడాను. కర్రకు కర్రా-కత్తికి కత్తీ యెదురొడ్డుటే మానవధర్మం. యీనీతిని తప్పినవాళ్లు అధోగతే.

మీర్ చంద్:-అది కాదండీ; నేను జెప్పేది. అంత తొందరపాటు మంచిది కాదంటున్నా. కాగితాలమీద పనులయ్యేటప్పుడు కాలిద్దిసి నెత్తికి రాసుకోవడ మెందుకంటున్నా. వాళ్లకు హృదయ పరివర్తన కలుగుతుందని నా విశ్వాసం.

కాలేఖాం:-వాళ్ల హృదయం రాతిబండలైతే?

మీర్ చంద్:-నల్లరాళ్లుకూడా కరిగిన పరిస్థితులున్నై.

రాణి:-రాతిహృదయాలు పరివర్తన జెందునని ఆశించేవాళ్లు మూర్ఖులూ, పిరికిపందలూను. పరాక్రమవంతులైనవాళ్లు పలుగు రాతిహృదయాలను పగులగొట్టి తమ కార్యాలు చక్కబెట్టుకుంటారు. అజగరముఖమునుండి అమృతాన్నాశించేవాళ్లు అమాయకులే. మేధావులెప్పుడూ దాని శిరస్సు నలగ్గొట్టి నిశ్చింతగానే వుంటారు. యీ బ్రిటీష్ బేరగాళ్లను ఆంగ్లేయులు రాతి గుండెలతో, విషపూరిత హృదయాలతో నివురుగప్పిన నిప్పులాగనున్నారు. అందుకుదగ్గ మందు యుద్ధమే. సేనాపతీ! యుద్ధసన్నద్ధ ప్రయత్నాలలో వుండండి.

(వేగముగా వెళ్లిపోవును)

(సశేషము)

---





## సరస్వతాకు పూరుబిండి (పచ్చడి)

సరస్వతాకును, పూరుబిండిగాచేసి 2, 3 సంవత్సరములు పిల్లలకు వేయుచుండినయెడల, దగ్గు, పడిశెము, మాటలురాకపోవుట మొదలగునవి లేక ఆరోగ్యముగ నుందురు. అన్నము మొదలగు ఆహార పదార్థములు బాగుగా జీర్ణమగును.

పచ్చడిచేయు విధానము—

పట్టెడు వల్లారాకు (సరస్వతాకు) తెచ్చి శుభ్రముగా నీటకడిగి, నీరు వడియనిచ్చి 2 చెంచాలు నెయ్యివేసి బాగా వాడ్చుకొనవలయును. ఆతర్వాత, చంచా వుద్దిపప్పు, 7, లేక 8 మిరియాలు 1 ఎండు మిరపకాయ, మిరియమంత ఇంగువ ఒకచిన్న అల్లంముక్క, 2 కరివేపాకుపోచలు, అంతా వేయించి తీసుకొని కాస్త చింతపండు తగినంత వుప్పువేసి నూరి వుపయోగింపుము.

ఎమ్. ఆర్. సీతమ్మ

## బూడిద గుమ్మడికాయ హల్వా

షుమారు 2 పౌనుల గుమ్మడిచేయాలంటే, పావుశేరు పాలూ, పావుశేరు చక్కెరా, కొంచెంజీడి పప్పూ, ఏలకులూ, నెయ్యీ వుండవలెను.

గుమ్మడికాయ చెక్కుతీసి ఎండుకొబ్బరి కోరంతో కోరవలెను. ఆకోరు ఒకపాత్రలో నీళ్లతో సహావేసి, పాలుపోసి వుడకపెట్టవలెను. ఆనీరూ, పాలూ ఇంకిపోయాక చక్కెరవేసి వుడకనీయవలెను. మధ్య మధ్య కలుపుతూ వుండవలెను. కొంచెం నెయ్యిగూడవేసి వుడకనీయవలెను. చక్కెరతోవుడికి పాకు వచ్చును. గట్టిపడినాక ఒకకళాయిలో నెయ్యివేసి జీడిపప్పువేయించి, అందులోనే ఈ ఉడికినహల్వా ముద్దవేసి కలుపవలెను. 10 నిమిషాలు చమురులో వుడికాక, ఏలకపొడిగాని, పచ్చకర్పూరంగానీ వేసిన మంచిసువాసనతో వుండును. ఇది ఒక వారంవున్నా చెడిపోదు.

## ఆనపగింజల చట్నీ

మనం సాధారణంగా ఆనపకాయతో ఎన్నోవంటలు చేసుకుంటూవుంటాము. అప్పుడప్పుడు గింజలు ముదిరినవనో, ఇష్టంలేకనో, పారేస్తాము. ఆగింజలతో చట్నీచేసుకున్న ఎంతోరుచిగా వుండును.

ఆనపకాయ వండుకున్నప్పుడు ఆగింజలు ఒకపాత్రలో వుంచవలెను. తగుమాత్రం ఎండుమిరప కాయలూ, మినపప్పూ, ఆవాలూ, ఇంగువా, ఒకపాత్రలో చమురువేసి వేయించవలెను. అందుకొంచెం చింతపండూ, ఉప్పూ, పసుపూవేసి రుబ్బవలెను. ఈ ఆనపగింజలుగూడ కొంచెం చమురులోవేయించి, వాటితో రుబ్బవలెను. ఈ ముద్దలో కొంచెం పోపుపెట్టిన ఎంతో సువాసనతో వుండును. అన్న హితవుగాగూడ వుండును.

కె. శేషురావు.

---

# (మా) అమ్మ సందేశము



పొడుపు మలపై ప్రొద్దుబాలుడు
పొడుచువేళల పొంగు ప్రకృతిని
చూడుమను నవశోభలన్నీ
నన్ను మా అమ్మ !

ఆడుకొమ్మను పాడుకొమ్మను
వేడుకొమ్మను విశ్వనాథుని
మూడుపూటల మ్రొక్కులొసంగి
నన్ను మా అమ్మ !

బువ్వపెట్టును బుజ్జగించును
నవ్వించును నొవ్వచేయను
పువ్వుచేతుల జోలపాటల
నన్ను మా అమ్మ !

తాత తండ్రులనాటి అపూర్వ
ప్రాతగాథలు మాటి మాటికి
ప్రీతిచెప్పను ప్రేముడించును
నన్ను మా అమ్మ !

దేశభక్తుల దీనబంధుల
మాసిపో నీమహిమ మార్గం
వాసికెక్కగ పాటుపడమను
నన్ను మా అమ్మ !

కలిసి మెలిసీ కాలమంతా
కలిమిలేముల కష్టసుఖముల
నడుచుకొమ్మను నలుగురితోడ
నన్ను మా అమ్మ

పొట్టనిండా పట్టెడన్నము
పెట్టకున్నా పేదసాదల
తిట్టవద్దను కొట్టవద్దను
నన్ను మా అమ్మ !

చెట్టుచేమల స్వేచ్ఛగా చిరు
పిట్టలు తిరుగబుట్టలల్లీ
పట్టుబట్టీ పట్టబోకను
నన్ను మా అమ్మ !

తిండిబట్టా దేశమంతా
నిండుకొనగా పాడిపంటలు
మెండుకొనగా పండించమను
నన్ను మా అమ్మ !

ఈశ సేవకు దీన సేవకు
దేశ సేవకూ దిక్కుచూడకు
లేశమైనా లెమ్ము లెమ్మను
నన్ను మా అమ్మ !

మరిచిపొమ్మను గరువమంతా
మరచిపొమ్మను మమతలంతా
మరువబోకుము మంచిదనమను
నన్ను మా అమ్మ !

నడుముకట్టి ఎడదవిడిచీ
బెడదవిడిచీ విశ్వసేవకు
విడక ధైర్యము నడు నడుమనును
నన్ను మా అమ్మ !

యస్. రాజేశ్వరిరాణి

విశాలాంధ్రలో త్వరలో విడుదల

స్వార్థం జీర్ణించి, బీద గొప్పల
వ్యత్యాసాలతో కుళ్లిపోతున్న
నేటి ప్రపంచానికి
సర్వ మానవ సమానత్వం
చాటు



వినోదా వారి

# శాంతి

చంద్రకుమారి.... సావిత్రి....సి. హేమలత
డా: గోవిందరాజుల సుబ్బారావు... రామచంద్ర కాశ్యప
ఆరణి... పేకేటి శివరాం...

కథ కొప్పలి... పాటలు సముద్రాల jr... సంగీతం సుబ్బరామన్... ఛాయ రంగా... కళ వాలి-గోడ్‌గాంకర్
దర్శకత్వం..వేదాంతం రాఘవయ్య



పూర్ణా రిలీజ్

నిర్మాతలు... వినోదా పిక్చర్సు..మద్రాసు.17.

MATA

# తుమ్మెద — పువ్వు

## శ్రీ బాలకృష్ణగారు

(గతసంచిక తరువాయి)

### ప్రేమ

ఆమెకు ప్రేమమాట తెలియకపోయినా ప్రపంచంలో అటువంటి పదార్థంమాత్రం వుందని తెల్సు ... తెలుసును ... తెలియదు ... మొత్తాన్కి—ఆమెకు అతన్ని చూచినప్పుడు అదోతీయనిభావం, గౌరవభావం కలుగుతూండేది. దానికి ఆమె ప్రేమ అనే పేరుపెట్టుకోలేదు. ప్రేమఅంటే నిర్వచనం తెలియకేమో! ప్రేమపేర జరుగుతున్న మోసాల సెరి గుండియేమో! ఏది ఏమయినా అది ప్రేమఅయినా కాకపోయినా ఆమెలో ఆభావం అడపా తడపా పొడసూపుతూనేవుండేది. కొన్నాళ్లు ఆమెకు ఆవిషయం తెలియకుండా జరిగేది. కొన్నాళ్ళదోలా అనిపించేది. ప్రస్తుతావస్థ ప్రేమావస్థ కావచ్చు. ఆపేరు, ఆభావాన్కి పెట్టుకోదు; ఆమెకు భయం అపనంటే. ప్రేమ దైవాంశ సంభూతం. ఈపేరు కామాన్కి మారుగా, నాగరీక నామంగా స్వీకరించబడి వాడబడుతోంది. కాంగ్రెస్ స్వాతంత్ర్య సంపాదనకోసం, సత్యప్రచారంకోసం స్థాపింపబడ్డ సంస్థ. అది బ్లాకుమార్కెటీర్లు ధరించే బురఖాగా మారిపోయింది. నిక్కచ్చి కాంగ్రెస్‌వాది, ఆపేరు పీకేసుకుంటే గౌరవం దక్కుతుంది. ఆమె, అతని సాన్నిధ్యంలోనూ, పరోక్షంలోనూ కల్గేభావాలకు ప్రేమపేరు పెట్టుకుందుకు సాహసించలేదు. అతను దూరంనుంచివస్తే మంచినీళ్లడగబుద్ధి, Human కర్టసీకోసంకాదు; పైపై Formality కోసంకాదు. ఏదో వింతమధుర భావప్రేరణవల్ల. అతను మాట్లాడుతూంటే చెవులప్పగించి వినబుద్ధి...ఏదో విపరీత శక్తి—ఆకర్షణశక్తి అతనివద్దకు లాగడంవల్ల. అతని దేహసౌందర్యం చూచినప్పుడు పొడసూపేది, అతని బాహువులమధ్య, అతని కౌగిలుల బిగువులోనూ వుండిపోదామనే భావంకాదు...అవ్యక్త భావాతీత ఆనందం. అతను, యీవాళకు వుండమని బతిమాలినా వుండడు.

అతని కంతతోస్తే అంత ఒక మెరపులావచ్చి ఆమె దృష్టిలోంచి మాయమయిపోతూంటాడు... ఆ మెరపుకాంతిని తలచుకొని రాత్రంతా గడుపమనాభావం! అతను రాగానే బాలభానునిచూచిన పద్మంలా విప్పారుతుంది ఆమెముఖం, వర్షాకాలంలో వచ్చి వర్షించిపోయే మేఘనిలావచ్చి ఆశాజ్యోతి ఆరిపోకుండా నూనెపోసి వెళ్తాడు. అతనితోపాటు ఎగురుతూవెళ్తుంది ఆమె మనసు. అతనువచ్చి ఆమెతో మాట్లాడినక్షణంవుండదు. మాట్లాడలేకాకాదు ... మాట్లాడితే బాగుండుననే కోరికలేకా కాదు ... ఒకటే ఒక కారణం ... ఆమెలో తాను వున్నట్టు తలచిన ప్రేమ బీజాన్కి దోహదం యివ్వడం అవుతుంది తాను మాట్లాడ్డం ... తను యింకా ఓనిశ్చయాన్కిరాలేదు, తాను చేసుకోకపోతే బాధపడుతుందనే బాధచేత దోహదం ఇవ్వడాన్కి యిష్టంలేక...అతనికి ఆమె అంటే యిష్టం. ఆ యిష్టాన్కి ప్రేమఅనీ పేరు తగిలించి ప్రేమకి యింకో అర్థాన్ని కల్పించేందుక్కి సాహసించకపోయినా, అతడు ఆమెఅంటే తనకదో విధమైన Fancy అనిమాత్రం ఒప్పుకుంటాడు. ఆమె అతని దృష్టిలో అతిలోకసౌందర్యవతి కాకపోయినా అందమయిందిమాత్రం అవును. అతనికీ యిష్టమే ఆమెను పెళ్ళాడ్డం. అతనికీ అనిపిస్తూంటుంది. అదోలా ఆమెను చూడకపోతే. అందుకే అప్పుడప్పుడు వెళ్లి చూస్తూంటాడు. అతను కనే స్వప్నాల్లో ఆమెరూపం, ఆమె మంచితనం సుస్పష్టంగా ఉండకపోతే, కాన్పించకపోతే స్ఫుటంచేసుకుందుకు వెళ్తాడు ... ఒకటి...అతని స్వప్నాల్లోని నాయిక యీమెకాదు...కాదనడానికి వీలులేదు ఈమెయే కొద్దితేడాల్తో...స్వప్నంలో నాయికకు ఐశ్వర్యం ఉంటుంది (ఈమెకులేదు) అంతేనా తేడా? అయితే ఢంకా బజాయించిచెప్పి చేసుకుందును అనుకుంటాడు. అతను Lectures కూడా ఇస్తాడు మరి కట్నాలు పుచ్చుకోడం అంత మంచిపనికాదని; (అతెందుకు మనకి?)...ఐశ్వర్యమందు ఆశలేదని తన ఆత్మని ఎంతమోసం చేసుకుందామనుకున్నా లోలోపల పీకుతూనేవుంది ఆశ. అంతతప్పా అతనిమీద తొయ్యడ మెందుకనుకుంటే యింకొక విషయం చెప్పవలసిఉంటుంది. అతనికి వీణవాయించే యువతిని చేసుకోడం సర్దా—అది ఆమెకురాదు (వచ్చే

దారిలేదు) అంచేత చేసుకుందుక్కా మనస్కరించటం లేదు అని అతని అంతరాత్మకు సమాధానం చెప్పుకుందామనుకుంటాడు. పైవిషయాల వెనుకనున్నదీ అతన్ని ఆమెను చేసుకోనివ్వనిదీ ఒక్కటే విషయం అతని ఆశాలతలు ఆకాశాన్నంటి వున్నాయి. ఆమె యింకా తలయెత్తేచూస్తోంది కాని ఎదగలేదు ఏవిధంగానూ-ఆ ఆశాలతల ఆలంబం యింకా చావలేదు. ఆగాలి మేడలకు పునాదులు లేవని అతనికింకా తెలియలేదు ... ఆకాశసౌధాలను పేకమేడలుగా కూలగొట్టే తుఫానురావొచ్చునని యింకా అతనికి తెలీదు. ఏ అచ్చరయో! ... ఏ అపరూప సౌందర్యవతియో! ... నలకూబరసతియో! ... అంతులేని ఐశ్వర్యంతో నాట్యంచేస్తూవచ్చి తన్ను చేసుకుంటుందని అతని వుద్దేశ్యం. అతను ఆమెను ప్రేమించాడు ... ఆవిషయాన్ని గుర్తెరుగకుండా గాలిమేడలు అడ్డంగా నిలబడిఉన్నాయి. అయితే ప్రేమ పరిస్థితులపైన ఆధారపడి ఉంటుందా! ... అతను అనుకుంటాడు ఆమెను ప్రేమించాననీ .. ఆమెను పెండ్లి చేసుకోలేననీ ... తను ఆమెను పెండ్లి చేసుకోలేనందుకు కుంటికారణాలు అంతరాత్మకు చూపుదామనుకుని తన్ను తాను మోసపుచ్చుకుంటున్నాడు... ప్రేమని గుర్తెరుగలేక నాశనమౌతాడా!

## కాలేజిగరల్

ఆమె శక్తి వంచనలేకుండా రోజూ పౌడరు మొదలయినవి రాసుకుంటూ, వున్నవాట్లో శుభ్రమయిన చీరకట్టుకొని వెళ్తూవుండేది కాలేజికి. ఆమె కాలేజికి వెళ్లేందుక్కా లాడ్జి ముందునుండి వెళ్లాలి. కనుక ఆమెఅల్లాగేవెళ్తూండేది. వరండాలో అంతానుంచుని కుక్కకూతలు, నక్కకూతలూ కూస్తూండేవారు. రోజూ అల్లాగే జరుగుతూండేది. ఆమె తల వంచుకు వెళ్లిపోతూండేది. "కుక్కలెన్ని మొరిగినా ఏనుగు పరపతి పోతుందా అనుకొంటూ...

ఆమె లాడ్జిముందు దారిలో కాలు పెట్టింది. వారు అంతావచ్చి వరండామీదనుంచుని కార్యక్రమం ఆరంభించబోతున్నారు. ఆమెగుండె దడదడా కొట్టుకుంటోంది. రోజూ యిదేగొడవ అయితే ఎంత నన్ను కాదనుకొన్నా భరించేదెలా? ఇంకొక అడుగు... మరొక అడుగు లెక్క పెట్టుకుంటూ వెళ్తోంది...

"ఆహా! మందగజేంద్ర గామిరా" అన్నది ఓ గొంతు.

"ఆహా! ఏం ఒయ్యారంరా" అంది యింకోగొంతు. కొంచెం ధైర్యంచేసి చూద్దామని తలెత్తబోయింది.

"ఆ బాగానేవుంది కోట"

ఏం ఆమె ఎల్లావుంటే వాళ్లకేంబాధ? వాళ్లు మాత్రం రాసుకోటంలా పౌడరు సెంటులను...

"అరే చాలాసీరియస్ ... యిప్పుడు చూసిందంటే మాడిపోతావు...ప్రక్కకు తప్పుకో"

ఏంచేస్తుంది? చూస్తేతప్పు...చూడకపోతే తప్పు తలయెత్తినడిస్తే "మొగరాజురా" అంటారు. తల దించుకుంటే ... "రా" అంటారు. ఇంకా గొడవ పడలేక ఓఅడుగు వేసింది, త్వరగాపోదామని.

"ఇంక ఎక్స్‌ప్రెస్ రోయ్ యిప్పుడిక్కడుందా ...మరుక్షణంలో...కాలేజీలో"

ఏంచేస్తుంది! ఆగోలసెలాగ అరికట్టడం. వాళ్ల ఉద్దేశము ఏమిటంటే ఆడవాళ్లను ఏడిపిస్తున్నామని. ఏడిపించడం అనేదాన్కి అదే నిర్వచనం అవుతే వాళ్లుమాత్రం అల్లాచెయ్యలేరూ వాళ్లు పదిమంది వున్నప్పుడు?

ఆమెకు కోపం మితిమీరిపోయింది. తలెత్తిఅటు చూసింది కొంచెం విసురుగా. వాళ్లంతా క్షణంలో మాయమయిపోయారు. ఆమెకుమాత్రం ఓమాట వినబడింది "నన్ను చూసిందేమోరోయ్. ప్రిన్సిపల్ తో చెప్తుంది."

పిరికివాళ్లుపాపం...ఆమెదారిన ఆమె కాలేజికి వెళ్లిపోయింది.

## సౌధాలు

అతను మూడురోజుల్లో పెళ్లిచూపులకు వెళ్లబోతున్నాడు; అంటే అతనువెళ్లి పని(క్షవరం) చేయించుకోవలసినషాపుFirst class Barber's shop అయివుండాలన్నమాట. కలలుకంటూ వెళ్తున్నాడు.

ఏదో ఆలోచిస్తున్న కళ్ళతో బార్బరుషాపుకు... అటువంటి ఆలోచనలకు కలలకు ఎప్పుడూ సాధో పరిభాగాలేకాని పునాదులు కనిపించవు. అల్లా పునాదులేకుండా ఆషాఢాలున్నందువల్ల ప్రజలకేం నష్టంలేదు. అతనికిమాత్రంవుంటే ఉండొచ్చుకాని (ఉండదనే నానమ్మకం.) అతన్ని పెళ్లాడబోయే ఆవిడ అతనిక్రాపును, మీసాన్నిచూచి మొదటి చూపులోనే Love చేసిపడెయ్యాలి. వెళ్లాడు సరిగ్గా బార్బరుషాపు ప్రాంగణంలోకి ... మెట్లు ఎక్కే సందర్భంలో అతనిమత్తు కొంతతగ్గింది... కొంతమాత్రమే ... తగ్గత .. ఒకకత్తెరపడేప్పటికి మెలకువవచ్చింది. "అంటెయ్యకు" అన్నాడు. "మొదలెట్టాశానండి అలవాటుచొప్పున; యింక కుదరదు" అన్నాడు. .. మరెల్లాగ అతనికి ఆరకం క్రాపంటే పరమఅసహ్యం ... దానికీ అతనితలకీ అసలు కుదరదని నమ్మకం.. ఎందుకో? ఎల్లాగయినా తప్పదుగా .. అంతా యిల్లాగే చేయించుకుంటున్నారు; యిదీ ఓఫాషనే అని సరిపెట్టుకున్నాడు ... అది అక్కడికివదలి మళ్ళా పడ్డాడు మైకంలో ... ఆమె అతని క్రాపుచూసి ఎల్లా Imagine చేస్తుంది? ఒక నాగరికుడులా ... అంతేనా? ... ఒక నవనాగరికుణ్ణి ఒంచెయ్యడానికి ఏఆడది ఒప్పుకోదు? బహుశాఆమె బాబ్డు హెయిర్‌తో వుంటుందేమో! ఏమో. ... అయితే మాత్రం తనక్రాప్ తప్పకుండా ఎప్రిషియేట్ చేస్తుంది. చేసితీరాలి... దానికి రెండోదారిలేదు. నవనాగరికురాలు కనుక ... First sight లో తప్పకుండా Impress అవుతుంది.. ఆలోచనలు సాగుతున్నాయి జీళ్ళపాకంలా ... అదేనా ఎక్కడో ఒకచోట సన్నమయి మానేస్తుంది. మనవాడి కటువంటి పొరపాటు పనేంజరగదు ...

"బాబూ ఫ్రెంచికటింగు చేయనా" అన్నాడు 'ఉ' అని పరధ్యానంగా ... ప్లగ్ నొక్కేంతర్వాత బల్బువెల్గడం మానుతుందా? ... ఓ నిముసంలో అతని మూనూగుమీసం అటు యిటు నిర్దాక్షిణ్యంగా కత్తిరించబడింది. ...

అతను చూచుకున్నాడు అద్దంలో ఎందుకో ఉలిక్కిపడి ... అతనికి సర్వాసహ్యం అటువంటిదంటే ... తనమీసాన్ని కత్తిరిస్తే యౌవనపు తొలి చిహ్నన్ని, యౌవనాన్ని కత్తిరిస్తున్నట్లు బాధపడే స్వభావం, ఏమంటాడు! తనేకా 'ఉ' అన్నది. ఊహు తనుకాదు; తనలో ఏదో మత్తు ఊ అంది. సరే ఏదంటేం మొత్తానికి యిప్పుడు తెలుసుండే అవన్నీ అతికమని కయ్యం... దెబ్బలాట పెట్టలేడుకద. ఇంకో Different model లోకి మార్చమని అడుగుదామనుకొన్నాడు. ... తీరా తనుమార్చమని అడుగుతే ఎదురుగానున్న ఫ్రెంచికట్టింగు ఆసామీ Insult గా తీసుకొని దెబ్బలాడతాడేమోనని భయం వేసిందికూడా చెప్పొద్దూ మరి ... తిరిగి ఇంటికివస్తున్నాడు...ప్రజలందరికీ అంటవేసినక్రాఫు, ఫ్రెంచికట్టింగుమీసం ఇష్టం...అదేనవనాగరికుని లక్షణంగా గుర్తిస్తారు. మరి తనకు అవి కుదరవు. ... అతనిలో వ్యతిరిక్త ఆలోచనలురెండు. రెండూ బ్రహ్మాస్త్రాల్లా కొట్టుకుంటున్నాయి ... అది అంతరాత్మకీ బాహ్యాత్మకీ సంకుల సమరమంటే కాదని ఎవరనగలరు? అన్నా అతను ఒప్పుకోదల్చుకోలేదు. ఒకటి ఆలోచించండి; న్యాయంగా అంతరాత్మ నెగ్గాలికదూ? అంతే నెగ్గింది. ఇంటికెళ్లి అద్దంతీశాడు .. రేజరు తీశాడు... బ్లేడు చేతిమీద అటూయిటూ నూరాడు. కత్తిపట్టిన వీరుడులా పోజుపెట్టి మొదలుపెట్టబోతున్నాడు మీసంమీద సాము; క్రాపు నేమీ చేయలేడు కనుక ... మీసాన్ని యిల్లాగ చేద్దామని ఊహ. Curve సరిగ్గా తిరగలేదు... తిరిగితే Symmetrical గా లేదు ... కోపము చెలియలికట్ట దాటిపోయింది. Impatienceకు హద్దులుమీరిపోయింది. రేజరు పూర్తిగా గీసేసింది మీసాన్ని... పెళ్లిచూపులు Postpone చేద్దామని అతని Proposal ... పెద్దల Disposal అయితే మొత్తానికి చిక్కే.

(సశేషము)

# స్త్రీ విద్య



శ్రీ జి. సుబ్బారావుగారు

ప్రాచీనకాలమున స్త్రీ విద్యవిషయమై భారతదేశమున ఎటువంటి ఉద్దేశ్యముండెడిదని నిశ్చయముగా చెప్పజాలము. ప్రాచీన చరిత్రనుబట్టి స్త్రీపురుషులలో సామాజిక దృష్టియందేవిధమైన భేదమును కాన్పించదు. నేటివలె స్త్రీ పురుషులయందు భేదభావము లుండెడివికావు. అందువలననే నాడు స్త్రీ స్వాతంత్రియమును గూర్చికాని, అధికారమును గూర్చికాని ఏవిధమైన సమస్య వచ్చెడిదికాదు. ఆసమయమున స్త్రీయొక్క ధ్యానమంతయు గృహముపైనే కేంద్రీకరింపబడి, ఆమెయొక్క లక్ష్యము సద్గృహిణి కావలెననియే యుండెడిది.

స్వామీదయానంద సరస్వతి, రాజారామ్ మోహన్ రాయ్ మొదలగు సంస్కర్తల కృషి చేతనైననేమి, పాశ్చాత్యుల సంపర్కము చేతనైననేమి భారతదేశమందు స్త్రీవిద్య ప్రారంభించబడెను. చాలా కాలము వరకు స్త్రీవిద్యయొక్క ఉద్దేశ్యము ఉత్తర ప్రత్యుత్తరముల కుపయోగింపబడుననియే తలంచుచుండిరి. తల్లిదండ్రులు ఇట్టి ఉద్దేశముతోనే తమ కుమార్తెలను చదివించుచుండిరి.

యువకులలో ఆర్థికముగానైననేమి, తదితర కారణముల వలననైననేమి విద్యయొక్క ప్రచారము ఎక్కువగుచున్నది. ఈనాడు విద్యావంతులగు యువకులు తాము వివాహమాడబోవు కన్యలు ధనవంతులైనను కాకపోయిననూ, విద్యావంతులుమాత్రమై యుండవలెనని కోరుచున్నారు. స్వాభావికముగా తల్లిదండ్రులు తమకుమార్తెలకు మంచివరుడు దొరకవలెనని కోరుచుందురుగదా! అందువలన కన్యలయొక్క విద్య వారి తల్లిదండ్రులకొరకు ఆవశ్యకవిషయమైనది. ఈ ప్రకారముగా యువకులయొక్క విద్య స్త్రీవిద్యను ప్రోత్సహించుచున్నది. స్త్రీవిద్య కేవలము ఉత్తరములు వ్రాయగలుగుటకే పనికివచ్చునను భావమీనాడు తొలిగిపోయినది. కొంతకాలమునకు స్త్రీవిద్యయొక్క ఉద్దేశము వివాహ వ్యాపారమందు కన్యలయొక్క విలువను ఎక్కువచేయుటయైనది. తల్లి దండ్రులు తమ కుమార్తెలను మిడిల్ క్లాసువరకు చదివించిన బీదవారైనప్పటికి సులభముగా వారు విద్యావంతులగు వరులను పొందగలుగుచున్నారు.

భారతదేశ మందిప్పుడు అమలులో ఉన్న విద్యావిధానము పాశ్చాత్యుల విద్యావిధానము ననుసరించి యున్నది. ఈ పాశ్చాత్య విద్యా విధానము భారతీయుల కుపయుక్తమైనదీ లేనిదీ ఇచ్చట యప్రస్తుతము. నేటివరకు పురుషునికొరకే జీవించి యుండుట స్త్రీయొక్క ధర్మమై యుండెడిది. పురుషునియొక్క అత్యాచారములను సహించి యుండుటయే ఆమెయొక్క ప్రథమకర్తవ్యమై యుండెడిది. సమాజమందామెకు వేరేస్థానములేదు. స్త్రీలు తమయొక్క అధోగతిని గుర్తించకపోలేదు.

విద్యావంతురాలగు స్త్రీ ఏవిధముగానైన ఈ దురవస్థ నంతమొందించుటకు

ప్రయత్నించుచున్నది. ఆర్థికదృష్టిచే పురుషుని పై స్త్రీ ఆధారపడుటయే ఆమెయొక్క పరాధీనతకు ముఖ్యకారణమని గుర్తించినది. స్త్రీలు ధనోత్పత్తి చేయనంత మాత్రమున స్త్రీలందరు సోమరులై నిరుపయోగముగానున్నారని మనము భావింపకూడదు. ధనము నార్జించుట ఎంతముఖ్యమో దానిని చక్కగా వినియోగపరచుట అంతముఖ్యము. ఇంటిపనులను జక్కబెట్టి, పిల్లలను పోషించి పదార్థముల తగువిధమున వినియోగపఱచుట వారి కార్యమైయున్నది. ఈ పనుల నెవ్వరోయొకరు చేయవలయును గదా? స్త్రీలు వీనికి చూడనియెడల పురుషులు వీనిని చేయవలసి యుండును. ఇట్లుగాక యనాది నుండి యీ కార్యము లందనుభవమును, నేర్పును సంపాదించిన వారు స్త్రీలగుటచేత వారు వీనిని నిర్వహించుట మూలమున పురుషులు ధనార్జనను దిగులు విచారములేక చేయ గలిగియున్నారు. కాని ఆ వివేకులగు చాలమంది పురుషులీ సంగతిని గ్రహింపరైరి. ఈవిధమైన తర్కవితర్కములతో విద్యావంతురాలగు స్త్రీకి స్వతంత్ర ధనోపార్జన ముఖ్యలక్షణమైనది. విద్యద్వారా స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యమును పొందగోరుచున్నది.

స్త్రీ తాను స్వతంత్ర ధనోపార్జన చేసినచో, ఆమెయొక్క దుఃఖములన్నియు అంతమగునని తలంచెను. సామాజిక దృష్టిలో పురుషునితో తాను సమానమగునని కలవరించెను. కానీ ఆమెఆశలు పూర్తికాలేదు. ఆమెస్వప్నము స్వప్నమేయైనది. స్త్రీ విద్యావంతురాలైననేమి? తండ్రియొక్క దృష్టిలో ఆమె పరాయివాని ధనము; భర్త దృష్టిలో ఆమె అతని ధనము; పుత్రునిదృష్టి వానితో యుండవలసిన వృద్ధమాతయు అయియున్నది. సామాజిక దృష్టిలో నేడుకూడా ఆమె పరాధీనమైన అబలయు, ఇంటిలో పిల్లలనుచూచే పరిచారికయునై ఉన్నది. "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అను లోకోక్తి ఇంకను సజీవమైయున్నది. కావున స్త్రీ, స్వాతంత్రియ మపేక్షించిన స్త్రీతత్వమునే బలిదానము చేయవలసియున్నది.

నేడు ఆర్థిక స్వాతంత్ర్యము స్త్రీ శిక్షయొక్క ఉద్దేశముకాదు. పురుషులతో సమానముగా ప్రతిరంగమందును పోటీ చేయుట స్త్రీ శిక్షణయొక్క లక్ష్యమై యున్నది. నేటి విద్యావంతులగు స్త్రీల కార్యక్షేత్రము గృహముకాదు. స్త్రీత్వమును గోల్పోయి సమాజమందు స్త్రీలు పురుషులతో సమానమైన స్థానమును పొందునదీ, లేనిదీ చెప్పజాలము. స్త్రీత్వము ప్రపంచమున లేకపోయిన సమాజమునకు హానికలుగునా? లేక లాభముకలుగునా? స్త్రీత్వము లోపించిన ప్రేమ, దయ, శ్రద్ధ, సహనము, మాతృత్వము మొదలగునవన్నియు నశించును. దీనిని విద్యావంతులగు స్త్రీలే ఆలోచింతురుగాక! స్త్రీత్వము కొరకై స్త్రీలు తమయొక్క యోగ్యత, వ్యక్తిత్వము, స్వతంత్రము వదలి పురుషుల అత్యాచారములను సహించి గృహస్థాశ్రమమును స్వీకరింతురా?

# శ్రీ శారదామణి దేవి జీవిత చరిత్ర

జయరాంబాటి గ్రామవాసి రామచంద్రుని భార్య శ్యామసుందరి ఒకనాడు తన రెండేండ్ల కుమార్తె శారదామణిని తీసుకొని సమీపగ్రామ దేవాలయంలో జరుగుచుండిన వుత్సవానికి వెళ్లింది. అక్కడ చేరిన అమ్మలక్కలు వేడుకకొద్దీ అందరు చిన్నపిల్లలను అడిగినట్లే శారదామణిని అక్కడ చేరిన మొగబిడ్డలను చూపి, "వారిలో నీమొగుడెవరని" అడిగారు. శారదామణి తన చిన్నవేలితో శ్రీరామ కృష్ణునే చూపించిందట.

దక్షిణేశ్వరంలో పారమార్థిక సాధనలో నిమగ్నుడైవున్న శ్రీరామ కృష్ణుడు ప్రపంచ లౌకిక దృష్టికి పిచ్చివాడుగా తోచాడు. ఆయనతండ్రి క్షుదీరాముడు, అన్న రామ్‌రాల్ గార్లు యీయనకు యీపిచ్చి తొలగిపోయేందుకు పెండ్లి చేయాలని ఎంచి, పిల్లకోసం వెదుకనారంభించారు. ఈవిషయం తెలియగానే శ్రీరామకృష్ణుడు విచారగ్రస్తులై వున్న మాతా సోదరులవద్దకు వెళ్లి "జయరాంబాటికి పోయి చూడండి; రామచంద్ర ముఖోపాధ్యాయుని యింట నాకోసం పుట్టివున్న ఆమె కనుపిస్తుంది." అని చెప్పాడట.

అయిదేండ్ల పసిబాలిక శారదామణికినీ, యిరవై మూడేండ్ల శ్రీరామకృష్ణునకు 1859 మేలో వివాహం జరిగింది. వివాహానంతరం నెలరోజులపాటు రామకృష్ణ, శారదాదేవు లుభయులూ కమ్మరి పుష్కరిణిలో గడిపిరి, ఎవరి పుట్టిళ్ళకు వారు వెళ్ళిపోయారు. దక్షిణేశ్వర్రం చేరిన శ్రీరామకృష్ణుడు తన పారమార్థిక చింతనలో నిమగ్నుడయ్యాడు. లోకం యీయను పిచ్చివానినిగా జమకట్టింది. ఈవార్త శారదామణికి కూడా తెలిసింది. భర్త పిచ్చివాడైనాడన్న వదంతి ఆమె మనస్సును కలచివేసింది. తండ్రితోపాటు దక్షిణేశ్వరానికి కాలినడకను బయలుదేరింది. ప్రయాణపు బడలికవల్ల ఆమెకు మధ్య మార్గంలోనే జ్వరం తగిలింది. తండ్రి వెంటనే సమీపాన వున్న సత్రంలో మకాం చేశారు. ఆజ్వరంతో ఒళ్లు తెలియకుండా వున్న శారదామణికి కాళీమాత దివ్యదర్శనమైంది. వెంటనే జ్వరం వుపశమించింది. మరునాడే ప్రయాణం మళ్లా ఆరంభించి నాటిరాత్రి 9 గంటలకు దక్షిణేశ్వరం చేరారు. చేరిన వెంటనే ఆమె తానుమాత్రం యింటిలోవున్న పెద్దల వద్దకు కాక, సరాసరి శ్రీరామ కృష్ణుని వద్దకే వెళ్ళింది. ఈయన పిచ్చివాడన్న పిచ్చిలోకపు మాటలు ఆమెకు జ్ఞప్తికి వచ్చి నవ్వుకున్నది.

ఒకనాడు శ్రీరామకృష్ణుడు ఆమెను "ప్రాపంచిక సౌఖ్యమనే యీ మాయలోకి నన్ను యీడ్వ దలిచావా?" అని అడిగారు. ఆమె "నేను తమ ఆధ్యాత్మిక జీవితానికి సహాయకారి నయ్యేందుకే వచ్చాను" అని సమాధానం యిచ్చింది.

ఇంకొకనాడు దేవి రామకృష్ణుని పాదాలు ఒత్తుతుండగా "నన్ను మీరు ఎలా భావిస్తున్నార"ని అడిగింది. "ఆ ఆలయంలో ఏతల్లి దేవతయై ఒప్పుతున్నదో, నన్నుగన్న ఏతల్లి నహూబత్తున నివసించియున్నదో ఆతల్లియే ఇప్పుడు నాపాదాలు ఒత్తుతున్నది" అని శ్రీరామకృష్ణులు సమాధానమిచ్చారు.

శ్రీరామకృష్ణు డీమెకు ఆధ్యాత్మిక సాధనములలో క్రమశిక్షణ నిచ్చేవారు. ఈమె పొందిన దివ్యానుభూతులు శ్రీరామకృష్ణుని ప్రథమ శిష్యురాండ్రైన చౌరీమా, గోలప్‌మా, యోగిన్ మాల వల్ల వెల్లడి అయినాయి.

మాతృదేవి అయిన శారదా మణికి శారీరకముగా ఎన్నో అసౌకర్యాలు వున్నా ఆమెకు గురుదేవుని సేవయే ప్రధానం. ఈమె తనభర్తరూపంలో వున్న శ్రీరామకృష్ణుని అవతార పురుషునిగా గుర్తించింది. శ్రీరామకృష్ణుడు కూడా యీమెను మానవకోటికి జ్ఞానభిక్ష పెట్టగల దేవతా మూర్తిగా భావించారు. 1873 మే నెలలో శ్రీరామకృష్ణులు ఈమెను దక్షి

నేశ్వరాలయంలో సకలాలంకరణలతో దేవి స్వరూపంగా భావించి పూజించారు.

శ్రీరామకృష్ణుడు భౌతికదేహాన్ని చాలించిన తరువాత యీమె శోకగ్రస్తయై చేతినున్న మురుగులు తీసివేయ బోతున్నప్పుడు "నేను చనిపోలేదు సుమా; ఒక గదిలోనుండి మరొకగదిలోకి వెళ్ళాను - అంతే!" అని శ్రీరామకృష్ణులు అన్నట్లు ఆమెకు తోచినదట. ఇట్టి దివ్యానుభవాలు ఆమెకు అటు తరువాత యెన్నో వచ్చాయి.

మాతృదేవి జీవితము ప్రార్థనాసహితమైన ఒక సాధన. అనుక్షణము శ్రీరామకృష్ణుడు ఆమె జీవిత నౌకకు చుక్కానియై నడిపించారు.

ఆచరణ శూన్యాలైన వుపదేశాలు ప్రాణంలేని కళేబరాల వంటివని ఈమె బోధించింది. తాను బోధించిన మార్గాలను ఆచరించింది. ఆమె సందర్శనమే దివ్యావేశ జనకం; ఆమెతో సంభాషణ తత్వజ్ఞాన దాయకం...

"మనో నిగ్రహము, నైర్మల్యమూ అమూల్యసంపదలు. నిర్మలహృదయం పరంజ్యోతిని చూడగలదని" ఆమె ప్రపంచానికి చాటిచెప్పినది.

ఈమె 1920 జూలై 20 న పరబ్రహ్మైక్యం పొందింది. ఈమె పవిత్రతలో సావిత్రిని, పారమార్థిక తేజంలో మైత్రేయిని సరిపోలిన వ్యక్తి.

(ఆంధ్ర పత్రికనుండి)

——(o)——

# త్వరలో విడుదల!

భరణీ వారి

# ప్రేమ

డైరెక్టర్
రామకృష్ణ











Love
(TELUGU)

భానుమతి
నాగేశ్వరరావు

ముక్కామల...సి.యస్.ఆర్...రేలంగి...శివరావు

శ్రీరంజని జూనియర్...సూర్యకాంతం...సురభి కమలాబాయి

సీతారాం...దొరస్వామి...సుబ్బారావు....

స్టూడియో
వాహిని




ఫోటోగ్రఫీ కమాల్ ఘోష్ • మ్యూజిక్ సుబ్బరామన్ • పాటలు మాటలు శర్మ • ఆర్టు కె. నాగేశ్వరరావు

ఆంధ్ర, సీడెడ్, నైజాం:- పూర్ణాపిక్చర్స్, విజయవాడ. మైసూర్ & కూర్గు:- డ్రీమ్‌లాండ్ పిక్చర్స్ కార్పొరేషన్, బెంగుళూరు-2. ఇతర వివరములు:- భరణీ పిక్చర్స్, మెడ్రాస్-17.

# స్త్రీల మాస ఫలితాలు

(13-2-1952 నుంచి, 12-3-1952 వరకు.)

త్రికాలవేది, జ్యోతిష్యచక్రవర్తి, ప్రొఫెసర్ కె. అంజి.

### మేషం:

(అశ్విని, భరణి కృ 1-పాదం)

కోపం ఆపుకొన్నా ఆగక స్వపార్టీని చూచే సరికి బైటపడుతుంది. ఓర్పులేకపోవడం మానసిక చింతను కూర్చుతుంది. ఇంట్లో ముఖ్యులకు సరిగ్గా వుండదు. ఇరుగు పొరుగులతో కలహాలు చెలరేగే సూచనలున్నవి. సంతానవంతులకు వారి క్షేమ లాభాలకై చేయుపనులు కలసివస్తవి. డబ్బుదాచు కొంటే అది బైట పడుతుంది. కర్చులుకొంత తగ్గించుకొంటారు. ఉష్ణాధిక్యం, ధర్మచింత, బంధు అసౌఖ్యం ముసలివార్కి నస నసలు శ్రుతిమించుతవి. మిత్రురాండ్ర అసమర్ధతవల్ల ప్లానులు శత్రు హస్తాల్లోకి చేరుతవి. పోలీసు చిక్కులు మీలో మీకే వుంటవి. జాగ్రత్తసుమా!

### వృషభం:

(కృ-2, 3, 4 పాదాలు. రో, మృగ 1, 2-పా.)

శక్తికి మించిన పనులకు మాటయివ్వడం కలుగుతుంది. స్వసౌఖ్యాన్ని పాటించరు. వస్తు సామగ్రి దెబ్బతినవచ్చు. ఆప్తుల ఆగమనం. విద్యావిలాస జయం. సంతోష వార్తలు. మాతృసమానులగు వారికి అనారోగ్యం. ఇంట్లో సర్వసమృద్ధి. చర స్థిరాస్తులు కొంటారు. ప్రేమలో జయం. దూరదేశస్థుల దర్శనం. ఉల్లాసం కల్గుతుంది. గ్రంధాలు, ఉపకరణాలు కొంటారు. స్వంతపనులు పూర్తియై ఒక రూపంలో తయారించ బడుతవి. త్రిప్పటం అధికం. తర్కాల్లో అపజయం. వ్యవహారాలకు దిగరాదు. రాయబారాలు శత్రుజయానికి మార్గం. అజాగ్రత్తగా మెలిగితే నవ్వటాల పాలేగాక ధననష్టంకూడా. భీకరజంతు దర్శనం. చివరలో చెడువార్తలు.

### మిధునం:

(మృ. 3, 4, పాదా, ఆర్ద్ర, పున, 1, 2, 3 పా.)

అతి శృంగార వస్తుప్రీతి. అధికభోజనం నిర్మొగ మాటలు. విహార విలాసాలపై మోజు. వాహన గృహ సేవక లాభం. పుణ్యకార్యములు చేస్తారు. దైవారాధనచే కార్యవిజయం కద్దు. బంధుస్వాగతం దూరబంధుమిత్ర వియోగం. ప్రేమలాభం. ప్రియ సంభావణ, సరస వచన రచనం. మధురవార్తలు వినడం. గర్భాభివృద్ధి. స్థూలత్వం పెరగడం కల్గుతుంది. స్వజాతి తనవార్లపైనే పోటీచేస్తుంది. వస్త్రలాభం. బహుమానాలు పొందుతారు. కుటుంబాభివృద్ధి. గొప్పవారి సలహాలు పొందుతారు. అనుకూల వాతావరణం అన్నిట్లో కల్గుతుంది. శత్రువులు మిత్రులౌతారు. సభాజయం.గృహ వస్తు సంపరణవ్యయం.

### కటకం:

(పున, 4 పాదం, పుష్యమి, ఆశ్లేష)

శత్రుభీతి నివారణం. శుఖాసక్తి. శృంగార వస్తు లాభం. ప్రయాణ జయాలు. దక్షిణ పశ్చిమ దేశాల వల్ల విశేషలాభం. వినోద విహార విలాసం. కుటుంబంలో సేవకబంధు పరిచారకుల మోసాలు పట్టుకుంటారు. స్వల్ప ధనక్షయం. రత్నాది లాభం. అమూల్య వస్తుకార్యం. పరిజనుల తారుమారు. అతిసహాసం. అధిక ఆదాయమునకు మార్గం ఏర్పడుతుంది. ప్రతిష్టంభనం పోతుంది. ఋణరోగ పీడాదులశాంతి. గుప్త చరత్వం. పోలీసుల శ్రమనివారణం. బంధు అననుకూలం. చిన్నలకు శుభం. పెద్దలకుమోసం. కష్టం. సర్వార్ధసిద్ధి. పరోపకార ప్రీతి. విద్యాజయం. శుభవార్తావళి. శుభ పిలుపులు.

### సింహం:

(మఖ-పుబ్బ, ఉత్తర 1 పాదం)

అసౌఖ్యానికి ఎంతదూరం వుందామనుకొంటారో అంతసన్నిహితం అవుతుంది. స్త్రీపోటీ. అవమానం. వ్యయాధిక్యం. మిత్రద్రోహం. పెద్దలమాట వినందుకు నష్టం కన్పిస్తుంది. విచార నివారణం. మొగమాటమువల్ల రావలసిన లాభాన్ని పోగొట్టు కొంటారు. ధనపుకసాల. సహాయకులకు అరిష్టం. ప్రతిస్తంభిత వృత్తి వ్యాపార లాభాలు కొద్ది

కొద్దిగా చలామణి కావడానికి దైవారాధన ముడుపులందించడం ముఖ్యం. ప్రేమలో అనుమానం. స్వజనులచే చాడీలు వింటారు. దొంగలబాధ, మోసపునష్టం, తలనొప్పి, అధికాలోచనం, విసుగు విరక్తిని కల్గిస్తుంది.

కన్య :

(ఉత్తర, 2, 3, 4 పాదా, హస్త, చిత్త, 1, 2పాదా)

ప్రతిపనిలో యిదివరకున్న జాగ్ర్యతనం క్రమేపిసల్లు తుంది. పరాయివారి ఆలోచన మీరు పుచ్చుకోవడం వల్ల ఆత్మశాంతి ధనప్రాప్తిగల్గుతుంది. నవీనుల దర్శనం. కంటిబాధ. ఉన్నా అడుగండే డబ్బు దానంతట అదేవస్తుంది. ధైర్యం ఏర్పడుతుంది. ముఖ్యులవల్ల మోసం తెలుసుకొంటారు. కలహాభీతి. శుభాసక్తి. ఇష్టబంధు దర్శనం. స్త్రీ జనాభివృద్ధి. సంతాన స్వజన మిత్ర సేవకాభివృద్ధి. క్రొత్త ఆభరణాలు పొందుతారు. బంధు ఆగమనం. నీతి ప్రబోధం, గ్రంధ పఠనం. శుభ కార్య వ్యయాధిక్యం.

తుల :

(చిత్త 3, 4 పాదాది, స్వాతి, విశాఖ 1, 2, 3పాదా)

లాభంలేనిపనిని చెయ్యరు. దుర్వ్యయం తగ్గించుకోలేరు. శరీరంలో పురుపులాంటి చర్మ వ్యాధులు లేవగలవు. పైకెక్కడంలో అజాగ్రత్తవల్ల పాదాలకు చేతులకు శ్రమకలుగగలదు. అతి తొందరవల్ల పనులు మీ అంతట మీరే చెరుచుకొంటారు. బంధువులకు నజరీనాలు సమిర్పించుకొంటారు. రాని బాకీలు జమ అవుతవి. క్రొత్త బంధువులను మిత్రులను దర్శిస్తారు. దైవసేవచేస్తారు. భోగభాగ్యాదులకు కొరవ వుండదు. ఇతర్ల మీద నమ్మి నడిపితే మీపనులు నష్టపడుతవి. మీ స్వబుద్ధి మేలు చేస్తుంది. శరీరం సన్నపడే లక్షణాలు కనుపిస్తువుంది. మీరు తిందామనుకున్నది మరొకరు సమయానికి కాజేసి కూర్చుంటారు. బంధు ఉల్లాసం.

వృశ్చికం :

(విశా, 4 పాదం, అనురాధ, జ్యేష్ఠ)

వ్యయాధిక్యంవల్లను., ఇష్టంకాని పనులు స్వజనులు చేయుటవల్లను మనశ్శాంతి ఆరోగ్యాలు దినదినం క్షీణిస్తూవుంటుంది. ఇదవరకు అందరూ మనవారే అనుకున్నవారు తూలనాడి దూరస్థులౌతారు. అప్పుపుట్టదు. అప్పుఅడగడం మానేయ్యడంవల్ల ఖ్యాతి పెరుగుతుంది. సౌఖ్యం తగ్గినా గొప్పకార్యాలు చేస్తారు. ఋణం తీర్చడం కష్టంగా తోస్తుంది. మిత్ర విరోధం ప్రేమ అసంతృప్తి. క్రొత్తవస్తులాభం. పాతవస్తువులు తాకట్టు పెట్టవలసినంత యిబ్బందులు కన్పిస్తవి. మోసగాండ్లవల్ల కీడు, అనారోగ్యం సంతాన వ్యథ కల్గుతుంది. సంతాన వృద్ధికూడా సూచిస్తుంది. గర్భదారణంకాని, కడుపునిండ భుజించుటకు లేపను అభివృద్ధి కాని లభించుతుంది. సహాయాలు వస్తవి.

ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం)

బలేకాలం. వద్దన్నా ఇంటినుండి బంధువులు మిమ్ము వదలి పోనేపోరు. డాంబికం జాస్తిఅవుతుంది. మిత్రవృద్ధి పరోపకారం. ధర్మం చేస్తారు. పేరు పెరిగిపోతుంది. ఉన్నతాధికారం లభించుటగాని, అధికార్ల ప్రాపకంగాని రాగలదు. శక్తి వృద్ధి అవుతుంది. సేవకులు మోసగించబోయి వెళ్లగొట్ట బడతారు. మేలుచేసినవారు కీడుతలపెట్తారు. స్థానచలన ప్రయత్నం సాగుతుంది. క్షేత్రలాభంకద్దు. ఆనంద వార్తలు వింటారు. సాహసాలుకు పోవద్దు. ప్రమాదం తగ్గుతుంది. ప్రయాణాలు తగ్గించుకోవలెను. అగ్ని జ్వరతాపాధనవ్యయాన్ని తప్పుకొంటారు.

మకరం :

(ఉ, 2, 3, 4, పా, శ్రవణం, ధనిష్ఠ, 1, 2 పా)

వస్త్రాభరణ పశుసేవక గృహక్షేత్ర భూలాభం, వృద్ధి. కుటుంబ వృద్ధి. సంగీత ప్రియత్వం, నూత్న యంత్ర సామగ్రులకొంటారు. స్వజనవృద్ధి. శ్రీమంతుల సహాయం ధనం అపారం, రేను. విద్యా-వ్యాపారాదుల్లో జయం. నవీనులతో పొత్తు అనుకూలం. శత్రువులు మిత్రులౌతారు. భోగభాగ్యప్రాప్తి. విశేషధన ప్రాప్తి ఋణనివారణం. అధికశ్రమ. నిద్రపట్టక పోవడం తగ్గుతుంది. స్వప్నాలు బాధించడం పోవాలంటే ఆంజనేయ ధ్యాన్నం నిద్రకుముందు చేయండి. దాచిన

వస్తువులు కాజేస్తారు. ఇంట్లో వారివల్ల మోసగింపబడుతారు. స్త్రీ శతృత్వం. దుష్టులు మిమ్ము పడగొట్ట చూస్తారు.

కుంభం :

(ధనిష్ఠ,3,4పా, శతభిషం, పూర్వాభాద్రా 1,2,3పా)

మిశ్రమ కాలం. లాభం తక్కువ ఆదాయాన్ని ఇతర్లపహరిస్తారు. చేనుమీద పంట పరాయీలది అవుతుంది. విశ్రాంతి తగ్గుతుంది. గొప్ప చిత్రాన్ని చదువుతారు. చూస్తారు. మంచి సలహాలు వింటారు. గురువులరాక, బంధువులరాక, స్వజనులరాక ధనవ్యయాన్ని కలిగిస్తుంది. అర్జనానికి కొరవవుండదు. సంతానానికి శుభకార్యాలు నడుచును. వస్త్రాభరణ ప్రాప్తి. బంధు సన్మానం. శుభకార్యాలకు పిలుపులు. ప్రయాణాల తారుమారు. నిరుత్సాహం కొంత తగ్గుతుంది. గొప్పక్షేత్ర దర్శనం. పుణ్య కార్యాలకు తొందరిస్తారు ఇరుగు పొరుగులు. సినిమాలాంటి వాటికెళ్లి వస్తువులు గ్రంథాలు, సామగ్రులు ప్రయాణాల్లో పోగొట్టుకొనే లక్షణాలున్నవి. ఎక్కడికైన ఉత్త చేతులతో తర్లండి.

మీనం :

(పూర్వభాద్ర, 4 పా, ఉత్తరాభా, రేవతి)

ఆనంద వార్తలు, కుటుంబవృద్ధి. ఇన్నేండ్లనుంచి కాని పనులు ఈసమయంలో వాటంతట అవే ఆకస్మికంగా అవుతవి. దుష్టులు నశిస్తారు. శతృం జయం కద్దు. బొజ్జ దిగుతుంది. సంతానప్రాప్తి వృద్ధికద్దు. స్త్రీలతో పగవస్తుంది. సమానస్కంధులు అవమానించదలచి చాడీలు చూస్తారు. విఖ్యాతి పెరుగుతుంది. శుభవ్యయం కల్గుతుంది. పూజ్యులగువారు మిమ్ములను ముందరికి నెట్టుతారు. రాజభోగ భాగ్యాలు పొందుతారు. అదృష్టం చేకూరుతుంది. కొంచం పండే చోట గొప్పగా పండుతుంది. నిప్పువద్ద జాగ్రత్తగా మసలండి. కోపం ఆపుకొన్నను ఆగదు. ఆయుధాలు కత్రలు విశనకత్రలతో పిల్లలను కొట్టితే చింతబడుతారు.

"గృహాలక్ష్మీ స్వర్ణకంకణము"



ఈసారి

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారికి

ఇవ్వబడును.

శ్రీమతి వావిలికొలను పద్మాసనమ్మగారు బి. ఎ.

అధ్యక్షత వహింతురు.

**2—3—1952**

ఆదివారం సాయంకాలం 4 గం॥లకు మదరాసు రాయపేటలో

కేసరికుటీరం, నెం. 15 వెస్ట్‌కాట్ రోడ్డున,

ఈ ఉత్సవము జరుపబడును.

ఎల్లరు విచ్చేయ ప్రార్థితులు.




## వానకథ!

చిట పట చినుకులు రాలంగా
విస విస గాలి వీచంగా
ఉరుములు, మెరుపులు మెరవంగా
ఆకులు, పిందెలు రాలంగా
జోరున వాన కురవంగా
జల జల నీరు కారంగా
పేదా సాదా తడవంగా
గుడిసెలు, గేదెలు తడవంగా
మన్ను వాసన కొట్టంగా
చల్లని గాడ్పులు వీయంగా
చక్కగ పంటలు పండంగా
రైతులు, బాబులు నవ్వంగా
మా పీపానిండుగ బియ్యముండంగా
చిట్టిచేతుల చిన్నినాన్న
భిక్షం తాతకు వెయ్యంగా
భలేభలే.. వానకథరా?
భలే భలే.. అన్నవు సోదరా!

మిస్. నిరుపమగురుకల్

---

ఒక స్త్రీని కుక్క కరిచింది. డాక్టరువచ్చి చికిత్సచేసి లాభంలేదనితోచి "మీకు ఆరోగ్యంచేకూరి బ్రతుకడం దుర్లభం. కాబట్టి మీకడసారికోర్కె లేమైననున్నచో చెప్పెయ్యవచ్చు"నన్నాడు.

ఆమె ఒక కాగితము తీసికొని గబగబ వ్రాయడం మొదలు పెట్టింది.

"ఏమిటమ్మా! అదేదో వీలునామాలాగ వ్రాస్తున్నావు" అన్నాడు డాక్టరు.

"కాదండి. నేను కరవబోయేవారి పేర్లపట్టీ తయారు చేస్తున్నాను" అన్నది ఆమె తీక్షణంగా.

# లోకవార్తలు



మదరాసు రాష్ట్ర శాసనసభకు జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్‌కు 152, కమ్యూనిస్టులకు 61, కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీకి 35, టాయిలర్స్ పార్టీకి 19, కృషిక్ లోక్ పార్టీకి 15, సోషలిస్టు పార్టీకి 13, కామన్‌వీలు పార్టీకి 6, ముస్లింలీగ్‌కు 5, ఫార్వర్డు బ్లాక్‌కు 3, షె. త. ఫెడరేషన్‌కు 2, జస్టిస్ పార్టీకి 1, స్వతంత్రులకు 63 ను లభించినవి.

♦ ♦ ♦

కాంగ్రెసేతర మద్రాసు శాసనసభ్యులు ప్రభుత్వము నేర్పరచుటకుగాను ప్రయత్నములు జరుగుచున్నవి.

♦ ♦ ♦

బొంబాయి ముఖ్య మంత్రిగనున్న శ్రీ బి. జి. ఖేరుగారిని శ్రీ భావనగర్ మహారాజా గారి స్థానే మద్రాసు గవర్నరుగా నియమింపవచ్చునని వార్త.

♦ ♦ ♦

తిరువాన్కూరు-కొచ్చిన్, మద్రాసు మంత్రి వర్గములు రాజీనామాలిచ్చినవి. దాని ఫలితంగా అచ్చట అజ్మాయిషి ప్రభుత్వములు ఏర్పడినవి.

♦ ♦ ♦

ఈనెల 11.వ తేదీనాడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయమై రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ పండిత నెహ్రూలతో చర్చించడానికి స్వామి సీతారాం ఢిల్లీకి వెళ్లారు. సంకల్పించిన సత్యాగ్రహమును కొంతకాలం వాయిదావేయుచు ప్రకటనకూడ జరిగెను.

♦ ♦ ♦

గుంటూరు, చిత్తూరు అనంతపురం జిల్లాలలో క్షామ పరిస్థితులను గురించి వార్తలు వస్తున్నవి.

♦ ♦ ♦

దేశంలో అన్నిరాష్ట్రాల గవర్నర్లు తమ పదవులకు లాంఛనప్రాయంగా రాజీనామ ఇవ్వనున్నారనియు, ఏ ఒక్కరు, యిద్దరు తప్ప తక్కిన అందరి స్థానే క్రొత్త గవర్నర్ల నియామకం సంభవమని వార్త.

♦ ♦ ♦

భారత ప్రభుత్వ దేశాంగమంత్రి ప్రస్తుతము నిర్బంధములోనున్న డిటెన్యూకేసులను పునఃపరిశీలించి ప్రజాభద్రతకు భంగకరమైన విధ్వంసక కార్యాలలో పాల్గొన్నట్లు ఋజువు పరచడానికి తగిన ఆధారములు లేనివారి నందరిని విడుదల చేయవలసినదిగా వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు సూచించాడు.

♦ ♦ ♦

మార్చి నెల మధ్యలోనే హైదరాబాద్‌నందు ప్రస్తుతపు ప్రభుత్వము అధికారము నుండి తప్పుకొని వెంటనే దానిస్థానంలో ప్రజా ప్రభుత్వము అధికారము స్వీకరిస్తుంది.

♦ ♦

శ్రీమతి హానా సెన్, అఖిలభారత మహిళా సభాధ్యక్షురాలు, హిందూ న్యాయశాస్త్ర సవరణ బిల్లు నెగ్గేటంతవరకు స్త్రీలు కృషిచేస్తారని హైదరాబాద్‌లో ఉపన్యసించుచు చెప్పిరి.

♦ ♦ ♦

ఈసంవత్సరము దేశం మొత్తముమీద 33 లక్షల టన్నుల ఆహారధాన్యాన్ని సేకరించవలసి యుంటుందట.

♦ ♦ ♦

క్రిందటి సంవత్సరము ఇండియాకు సప్లయి చేసిన ఆహారధాన్యాల విలువ 19 కోట్ల డాలర్ల అప్పును

అమెరికా రద్దుచేయాలని డిమాక్రాట్ సభ్యుడు యఫ్. డి. రూజ్‌వెల్టు ప్రజాప్రతినిధుల సభలో ప్రతిపాదించాడు.

♦ ♦ ♦

బ్రిటనుకు 30 కోట్ల డాలర్లను అమెరికా సహాయము చేయనున్నదట.

♦ ♦ ♦

ఫిబ్రవరి 6 వ తేదిన ఆరవజార్జిరాజు మరణించారు. ఆయన పెద్దకుమార్తె ఎలిజబెతురాణి రాజ్యాధిపత్యము వహించింది.

♦ ♦ ♦

జనవరి నెల 29 వ తేదిన సరిహద్దుదాటి వచ్చిన జాతీయ చైనా సైనికులతో బర్మా సేనలు యుద్ధము సాగిస్తున్నట్లు అధికార రీత్యా ప్రకటించ బడింది.

♦ ♦ ♦

బొంబాయి ప్రభుత్వ హోముశాఖ మంత్రి మురార్జీదేశాయి రాష్ట్రశాసన సభ ఎన్నికలలో ఓడిపోవుటచే అతనిని అసెంబ్లీ కాంగ్రెస్ పార్టీ నాయకుడుగా ఎన్నుకొనుట కనువుగా బొంబాయి శాసనసభ కాంగ్రెస్ పార్టీ తీర్మానించింది.

♦ ♦ ♦

జనవరి 30 వ తేదిన గాంధీమృత వార్షిక వర్ధంతి దేశం మొత్తముమీద జరిగింది.

♦ ♦ ♦

భారతప్రభుత్వము ఏర్పరచినసంస్థ 1951 సం||ము 15939 మంది అపహృత స్త్రీలను వెదకి వారిని వారి బంధువులకు అప్పగించిరట.

♦ ♦ ♦

మద్రాసు నగరంలో నీటికరువు పరిస్థితులు ఏర్పడిన, పరిశ్రమ శాలలకు నీటి సప్లయి చేయబడదని తెలియజేయబడింది. ప్రజలకు సయితం నీటి సప్లయి కాలం తగ్గించబడింది, నీటిసప్లయి చేయుటకై కార్పరేషను ప్రణాళికలు తయారు చేయుచున్నది.

♦ ♦ ♦

సూయజ్ విషయంలో తమ పట్టుదల సడలదని పార్లమెంటులో అంతోని ఈడెన్ ప్రకటించాడు.

♦ ♦ ♦

ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు కాంగ్రెస్ అధ్యక్షునకు సమర్పించిన నివేదికలో "నవచైతన్యంతో ఆంధ్ర కాంగ్రెస్‌ను సంఘటిత పర్చాలనే సంకల్పంతో మహిళలు, కార్మికులు, విద్యార్థులు కాంగ్రెస్ కార్యక్రమంలో పాల్గొని ఉత్సాహంతో పనిచేయడానికి అనుకూలమైన వాతావరణమును కల్పించే విధానమును సూచించారట.

♦ ♦ ♦

ఈసంవత్సరము యితర దేశములనుండి 50 లక్షల టన్నుల ధాన్యము దిగుమతి కావలసి యుండునని ఇండియా రిజర్వుబ్యాంకి అంచనా.

♦ ♦ ♦

భారత ప్రధాన న్యాయమూర్తిగా శ్రీమండల కలత్తూరు పతంజలి శాస్త్రిగారు నియమించబడిరి.

♦ ♦ ♦

సూర్యునినుంచి లభ్యమయే వేడిమితో వంటచేసే పద్ధతిని కొందరు భారతీయ వైజ్ఞానికులు కనుగొన్నారనియు, నాలుగయిదు రోజులక్రిందట తాను అట్టి వంటకాన్ని రుచి చూచానని పండిత నెహ్రూ వెల్లడించాడు.

♦ ♦ ♦

ఇండోనీసియా రాయభార వర్గము చెన్నపురిలో పత్రికా విలేఖరుల గోష్టిలో ఇండియాలో ఎన్నికల కార్యక్రమము సౌమ్యముగాను, న్యాయముగాను జరుగుచున్నదని ప్రశంసించిరి.

♦ ♦ ♦

జనవరి 22 వ తేదిన నేపాలు హోమ్‌గార్డులు ఆకస్మికంగా తిరుగుబాటుచేసి ప్రభుత్వ సెక్రటేరియట్, గౌచార్ విమానాశ్రయాన్ని, బ్రాడ్కాస్టింగ్ స్టేషనును, టెలిఫోను ఎక్స్చేంజిలను, ఆయుధాగారాన్ని స్వాధీనం చేసికొన్నారు. కాని త్వరలోనే పరిస్థితులు ప్రభుత్వ అదుపులోనికి వచ్చినవి.


C.11
BETTER THAN THE BEST
Co-optex
FABRICS
కో-ఆప్టెక్స్
వస్త్రాలు
ఆబాలగోపాలానికి
ఆకర్షణీయమైనవి
మద్రాస్ స్టేట్ హాండ్‌లూం వీవర్స్
కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్.

# సాధ్వీప్రశంస



అమరులు వెఱగంద న్త్రిమూర్తులను నిసుఁగులఁ జేసిన యనసూయ యొక తె,
యంతకు వేఁడి, నిజాధిపు జీవముల్ వెనుఁదెచ్చినట్టి సావిత్రి యొక తె,
యాత్మేశు రక్షణకై సూర్యు నుదయమ్ము మాన్పిన కౌశికు మగువ యొక తె,
దిక్పతుల పరీక్షఁ దేటి వల్లభు వివాహంబైన యా దమయంతి యొక తె,
భర్తృ సత్యవ్రతావన పరత మెలఁగి శ్రమల నెన్నియొ కనిన చంద్రమతి యొక తె,
మఱియు నెందఱో సతుల జన్మములమివ్వులఁ బ్రతిభఁ గాంచెను జగతి, నీ భరతభూమి॥

ఎంచన్ మదిని నహల్యన్ బాంచాలిం, దారఁ, దార మండోదరి, శీ
లాంచితధన్యలఁ, గన్యలఁ, బంచ సతుల, సంచితోరు పాపములుడుగున్.

వేదము వేంకటకృష్ణ శర్మ



# మదరాసు సంగీత కళాశాల వార్షికోత్సవం

మద్రాసు, జనవరి 20 - మదరాసు సంగీత కళాశాల (గోపాలపురం) ఆరవ వార్షికోత్సవం నిన్న గోపాలపురం గర్ల్స్ హైస్కూలులో జరిగినది. హైకోర్టు న్యాయమూర్తి శ్రీ డబ్ల్యు. ఎస్. కృష్ణస్వామి నాయుడుగారు అధ్యక్షత వహించారు. సంగీతకళానిధి శ్రీ టి.వి. సుబ్బారావుగారు "సాంస్కృతిక దృష్ట్యా సంగీతం విలువ" అనే విషయంపై ప్రసంగించారు.

సభ సాయంకాలం 5 గంటలకు విద్యార్థి విద్యార్థినుల జంత్ర సమ్మేళన కార్యక్రమంతో ఆరంభమైనది. తరువాత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి ఎస్. సి. ద్వారకా పార్థసారథిగారు వార్షికనివేదికను చదివారు. గవర్నమెంటు పరీక్షలకు హాజరైన విద్యార్థినులందరు మొదటి తరగతిలో ఉత్తీర్ణులైనారని తెలిపారు. గొప్ప విద్వాంసులు, గాయకులచే పొగడబడిన "గానకళాభోధిని" అనే సంగీత గ్రంథము కళాశాల ప్రిన్సిపాలుచే రచింపబడినట్లు తెలిపారు.

తదుపరి నృత్య ప్రదర్శనములు, గాన వాద్య ప్రదర్శనములు జరుపబడినవి. ప్రకృతి గానమని, లయమయమని సూచించు చంద్రగ్రహణమును నృత్యముతోను, గానముతోను ప్రదర్శించారు. ఇదియొక క్రొత్తపోకడలోను, పరిశోధనతోను కూడియుండుటవలన ప్రేక్షకులు ముగ్ధులైనారు. తరువాత "తిరువిళైయాడల్ పురాణము" లోనుంచి ఒక ఘట్టం సంగీత నాటకంగా ప్రదర్శింపబడినది.

అధ్యక్షులు శ్రీకృష్ణస్వామి నాయుడుగారు ప్రిన్సిపాలుతో తమకున్న అధిక పరిచయమును తెలుపుతూ కళాశాలకు స్వంత భవనమును నిర్మించుకొనుటకు ప్రజలు ఉదారులు సహాయం చేయవలెనని విజ్ఞప్తిచేశారు.

శ్రీ టి.వి. సుబ్బారావుగారు తమ ఉపన్యాసంలో సంగీతం ప్రాముఖ్యాన్నిగురించి త్యాగరాజుల వారి రచనల ఘనతనుగురించి ముచ్చటించారు. శ్రీ ఎస్. సి. పార్థసారథిగారి వందనసమర్పణతో సభ సమాప్తమైనది.



బ్రిటిషురాణి రాజ్యాధికారాన్ని స్వీకరించే సమయమున యీ క్రింది విధముగా ప్రమాణం చేసింది:—

ప్రజాశ్రేయస్సు, అభ్యుదయాలకోసరం కృషిచేస్తాను.

♦ ♦ ♦

బరోడా విశ్వవిద్యాలయ ప్రొఫెసరు డా. యస్. చంద్రశేఖర్ తెనాలిలో జరిగిన అఖిలభారత హేతువాద ద్వితీయమహాసభకు అధ్యక్షత వహించుచు నిట్లుపన్యసించిరి:—

ఈ ప్రపంచములో మానవనాగరికత, మానవజాతి మనగలగాలంటే యుద్ధమనేది ఎన్నటికి తలపెట్టరాదు. మానవుడు శాంత స్వభావమును పెంపొందించుకొని తోటి మానవులతోను, తన చుట్టూఉన్న పరిసరాలతోనూ సామాన్యంగా జీవించగలిగిననాడే ఇది సాధ్యమగుతుంది. ఈనాడు సమస్త మానవకోటిని ఆవహించిన భయాన్ని నిర్జించాలి. అప్పుడే వివేకోదయం కాగలదు; శాంతిని సాధించగలము.

శ్రీ జి. యన్. మూర్తిగారు పార్లమెంటుకు ఎన్నిక అయిన శ్రీ వి. వి. గిరి, సీతారామరెడ్డిగార్ల గౌరవార్థము చేసిన విందులో శ్రీ గిరిగారు యిట్లుపన్యసించిరి:—

దేశమనందు ప్రజా స్వామ్యమునందు విశ్వాసముగల అభ్యుదయ శక్తులన్నీ కమ్యూనిష్టులతో గాని, నియంతృత్వ విధానంకోరే ఏ శక్తులతోనూ పొత్తు పెట్టుకోకుండా గాంధేయ మార్గంలో సమాజవాదవ్యవస్థను స్థాపించుటకు ఏకం కావాలి.

♦ ♦ ♦

సింధూరియా పటిబ్రహ్మ సమాజమున శ్రీరామకృష్ణ పరమహంస వార్షిక సమావేశ సందర్భమున పలికిన పలుకులలో నిట్లు కలదు:—

మనస్సు పాలవంటిది. ఆ మనస్సును సంసారజలముతో చేర్చినచో పాలు నీరు కలసిపోవును. అందువలన ఆపాలను నిర్జన స్థానమున తోడుబెట్టి వెన్న తీయవలెను. నిర్జన స్థానమున సాధనములు సలుపునపుడు మనస్సను పాలనుండి భక్తిజ్ఞాన రూపకమగు వెన్న బయలువడును. ఇక ఆవెన్నను సంసారజలమున నిర్భయముగా నుంచవచ్చును. అది పైమీద నిర్లిప్తమై తేలును.

♦ ♦ ♦

మ్యూజియం తియేటరులో మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పాకాల రాజమన్నారుగారు ఎగ్మూరు నాటక సంఘ రజతోత్సవాలను ప్రారంభించుచు నిట్లుపన్యసించిరి:—

భావశబలతకు, జీవితవైవిధ్యానికి సంబంధించిన భిన్నదృక్పథాలను చూపించే క్రొత్తరచనలు కావాలి. భారతజాతి చరిత్రగాథలు సంఘములోని విద్వేషాన్ని రేకెత్తించే శక్తుల్ని ఖండించి సత్పురుషులను తయారుచేసే నాటకాలు యిప్పుడు కావలసి యున్నవి.

——(:o:)——




పండ్లు : శ్రీ గోటేటి జోగిరాజు. ప్రకాశకులు, ఆంధ్రగ్రంథాలయ ట్రస్టు, పటమటలంక. నాల్గవభాగము, అయిదవ భాగములుగా రెండు సంపుటములు. మొదటిది అయిదు రూపాయలు, రెండవది నాలుగు రూపాయలు.

నాల్గవభాగపు సంపుటములో మామిడి, నారింజ కుటుంబములు కాక తక్కిన ద్విదళబీజకజాతులను గురించి వివరించియున్నది.

అయిదవ భాగపు సంపుటములో అనాస, అరటి, కొబ్బెర వగైరా ఏకబీజకజాతులను గురించి వివరించబడినది.

గ్రంథకర్త మద్రాసు వ్యవసాయశాఖలో చాలకాలము అసిస్టెంటు డైరెక్టరుగా పనిచేసి అపారమయిన అనుభవమును గడించినవారు అంతేకాక ఫలవృక్షముల పెంపకములో స్వయముగా కృషిచేసి దాని ఫలితంగా తన అనుభవాన్ని ప్రజలలో ఫలవృక్షాల పెంపకమును ప్రచారముచేయ సమకట్టి యీగ్రంథ రచనచేశారు.

ఇవి చాల ఉపయోగకరమైన గ్రంథములు. తిండిగింజల కొరతవలన, కల్తీలేని ఆహారము లభ్యము కానందువలన ఏర్పడిన విషమపరిస్థితులలో పండ్ల ఆవశ్యకత అత్యధికము. అందుకుగాను వివిధఫలములను గురించినట్టియు, ఆయావృక్షముల పెంపకమును గురించినట్టియు విజ్ఞానము చాల అవసరము. అట్టి దానిని యీ గ్రంథములద్వారా గ్రంథకర్త ప్రజాబాహుళ్యానికి ప్రసాదించారు.

ఇందు ప్రతియొక్క ఫలమునుగురించి, దానివృక్షముల పెంపకమును గురించి సాకల్యముగా చిత్రపటములతోసహా వివరించబడినది. అంతేకాదు; ఆయావృక్షములయొక్క యితర భాగముల ఉపయోగము కూడ వివరించబడినది.

ఈ గ్రంథముల ప్రాముఖ్యమును గుర్తించి, అందలి విజ్ఞానమును తమ అభివృద్ధికి ప్రజలుపయోగించుకొందురని మా విశ్వాసము.

'వనితావిహార్' జన్మదిన సంచిక మా కార్యాలయమునకు చేరినది.

చిన్న చిన్న కథలు, వ్యాసములున్నవి. ఈ పత్రిక 15, 25 తేదీలలో ప్రతినెల వెలువడును. సంవత్సరం చందా రు 3-0-0 లు. విడిప్రతి 0-1-6.

ఈ పత్రికా సంపాదకులు శ్రీమతి చి. సత్యవతీదేవిగారు రాజమహేంద్రవరములో 'వనితావిహార్' బాలికా సంగీతపాఠశాలనుకూడ నిర్వహించుచున్నారు.

**'సౌభాగ్య' వార్షికసంచిక మా కార్యాలయమునకు చేరినది.**

మదరాసు ప్రభుత్వ స్త్రీ జనాభ్యుదయ శాఖవారు యీ సంచిక వెలువడచేయుటలో చూపిన ఆసక్తి, దీక్ష కొనియాడతగినవి. మహిళాభ్యుదయము నుద్దేశించిన వ్యాసము లనేకములున్నవి. ప్రతియొక్క వ్యాసము తప్పక చదువతగినది. ముఖ్యంగా స్త్రీలు యీ సంచికయందలి వ్యాసములను చదువుటవలన అపారమైన విజ్ఞానమును సంపాదించుకోగలరు. మహిళా ఉద్యమవ్యాప్తికి యీపత్రిక చేయుచున్న కృషి అమోఘమైనది.

ఇందలి కథలు, చిత్రములు, కవిత్వసంపద యీ సంచికకు ప్రత్యేకశోభను సమకూర్చినవి.

ఈ వార్షిక సంచిక వెల 8 అణాలు వార్షికసంచికతోసహా వార్షిక చందా 2.0.0 మాత్రమే.

**ఊర్మిళ : కొరివి వేంకటరామమూర్తిగారు. ప్రకాశకులు : కోరాడ చిన్న రామన్న అండ్ బ్రదర్సు, పర్లాకిమిడి.**

జమ్‌షెడ్‌పురపు ఆంధ్రకాటకసాహిత్య సంఘమువారు ఏర్పాటుచేసిన వ్యాసరచన పోటీలో ప్రథమ బహుమానముపొందినది యీ 'ఊర్మిళ' అను వ్యాసము. ఇది చిన్నపుస్తకముగా ప్రకటించబడినది.

ఊర్మిళ శ్రీరామచంద్రుని తమ్ముడగు లక్ష్మణుని భార్య. ఆమె సౌశీల్యము పాతివ్రత్యము మొదలగు విషయములనుగురించి రామాయణాది గ్రంథముల నాధారముచేసికొని వ్రాయబడినది.

——(0)——



శ్రీమతి రామేశ్వరినెహ్రూ

ఈమె సుప్రసిద్ధ సంఘ సేవకురాలు, మహిళా ఉద్యమ నాయకురాలు. జరిగిన ఎన్నికలలో డిల్లిరాష్ట్రములో పోటీచేసింది.



డా. సౌందరం రామచంద్రన్

ఈమె సుప్రసిద్ధగాంధీజి అనుచరులైన రామచంద్రన్‌గారి భార్య. నిర్మాణ కార్యక్రమ నిర్వాహణలో భార్యాభర్తలిద్దరుఆదర్శప్రాయులు. ఈమె యీమధ్య జరిగిన ఎన్నికలలో మదరాసు శాసనసభకు ఎన్నుకోబడింది.

# సంపాదకీయములు

## ప్రత్యేక స్త్రీ సంస్థలు

అఖిల భారత మహిళాసభ స్త్రీ సమస్యలను గురించి, హక్కులను గురించి విశేషముగా ప్రచారము, ఆందోళన చేయుచున్న ఫలితంగా మహిళాభ్యుదయకరమగు మార్పులనేకము వచ్చినమాట నిజమేకాని దాని అనుబంధ సంస్థలుగా వ్యవహరిస్తున్న మహిళా సంఘాల కార్యక్రమం నిలకడగాను, నిర్మాణాత్మకముగా లేదని చెప్పక తప్పదు. ముఖ్యంగా సమాన హక్కులను గురించి జరుగుచున్న ఆందోళన గమనించ తగినది. సమానహక్కులనే నినాదమును వాస్తవ పరిస్థితుల దృష్ట్యా పరిశీలించడం ఎంతైనా అవసరము.

ఉద్యోగముచేసి సంపాయించడము ఎంత ముఖ్యమో తమ ఆదాయము ననుసరించి గృహనిర్వహణము జరుపుటకూడ అట్టిదే. కాబట్టే పెద్దలు 'ఇంటగెలిచి రచ్చగెలువ' మన్నారు.

ఇట్టి గృహనిర్వహణకు స్త్రీలకు విద్య చాల అవసరం. ఆ విద్య తమ ఆర్థిక పరిస్థితులను అర్థము చేసికొని, తాము, తమ కుటుంబము ఆదర్శవంతమైన జీవితమును గడుపుట కుపకరించగలదిగా నుండవలెను. అంతేకాని పురుషునితో సమానంగా ఉద్యోగాలు చేయాలని కాని, పురుషులు చేసినపనినల్లా తాము చేయాలని కాని ఉద్దేశించి విద్యాభ్యాసము చేయడం చాల పొరబాటు. కాబట్టి స్త్రీలకు ఉద్దేశించబడిన విద్యలో గృహనిర్వహణకు సంబంధించిన ఆర్థిక శాస్త్రము, బాలబాలికలకు విద్యగరపుట, ఆరోగ్య శాస్త్రము, లలితకళల నభ్యసించుట, వీలైనంతవరకు గృహోపకరణములను సమకూర్చుకొనడం చేర్చబడాలి. వీని ప్రాధాన్యత మీదనే సుఖప్రదమైన కుటుంబ జీవనము ఆధారపడి యున్నది.

స్త్రీలు సమానహక్కులు కోరినా సుఖప్రదమైన కుటుంబజీవనము నుద్దేశించియే యుండవలెను. దానితో నవసరములేని స్త్రీలుండరనియే మానమ్మకం.

అయితే గృహ నిర్వహణముయొక్క ప్రాముఖ్యతను పురుషులు గుర్తించునట్లు చేయుటయు, పురుషులు ఉద్యోగాలుచేసి ధనమార్జించి నంతమాత్రమున వారి ఆధిక్యత ఏమియు లేదనియు, సంఘములో స్త్రీలకు జరుగుచున్న అన్యాయములను అరికట్టవలెననియు, తమ కుటుంబములకు అవసరమైన దైని కావసరములు.కూడు, గుడ్డ, వైద్యసహాయము, నివాసయోగ్యమైన గృహవసతుల సమకూర్చుటకు ఆందోళన చేసి, తమ మహోన్నతమైన లక్ష్యము ఆనందమయమైన కుటుంబ జీవనమును సాధించుటకు మహిళా సంఘాలు కృషిచేయాలి. అనాడే మన జాతి ఆదర్శప్రాయమైన జీవితము గడుప కలుగుతుంది.

ఈకార్యక్రమం శాసనసభల్లోను జరుగవచ్చును; ప్రజాబాహుళ్యంలోను జరుగవచ్చును. ఇందుకు ప్రత్యేక స్త్రీ సంస్థలు అవసరమనేది నిర్వివాదాంశము.

## రాజమృతి - ఎలిజబెతురాణి రాజ్యస్వీకారము.

ఇంగ్లాండు రాజు, పూర్వపు ఇండియాచక్రవర్తి అయిన ఆరవజార్జిరాజు మరణము చాల విచారకరమయింది. ప్రపంచ మంతటితో బాటు మనదేశముకూడ తన సంతాపమును వెల్లడిస్తున్నది.

మన రాజకీయాభిప్రాయములు, విధానములు ఇంగ్లాండుతో బేధించినా వ్యక్తిగతంగా బ్రిటిషు రాజరికంతో మనకట్టి తగాయిదాలేదు. ఉభయులము యెల్లప్పుడు సుహృద్భావంతోనే మెలగాము.

ఆయన కుమార్తె ఎలిజబెతు రాణిగా రాజ్యాధికారము స్వీకరించింది. ఈమె కాలంలో ఇండియా ఇంగ్లాండు సంబంధములు మరింత సన్నిహితంగా నుండగలవనియు, అభ్యుదయ కార్యక్రమంలో ఈదేశాలు రెండును పరస్పర సహకారంతో ప్రపంచ సమస్యలను పరిష్కరించుటకు కృషిచేయగలవనియు ఆశించుచు నూతనముగా రాజ్యస్వీకారము చేసిన ఎలిజబెతురాణిని అభినందించుచున్నాము.

—(౦)—

# శ్రీ ఖరనామ సం॥ర మాఘ-ఫాల్గుణ మాసములు.

| | | | |
|---|---|---|---|
| 1952 సం॥ ఫిబ్రవరి నెల | 16 | శ | పం 8.7 బి 27-10 రా 8.27 వరా 9.22 మొ 10-58 క |
| | 17 | ఆ | ష 7.1 స్వా 27-30 వరా 9.21 మొ 10.55 క |
| | 18 | సో | స 4-48 విశా 22-31 వరా 7.13 మొ 8.51 క |
| | 19 | మం | అ 1-27 ఏప్యా 55.16 అనూ 20-25 వరా 7-55 మొ 9-26 క |
| | 20 | బు | ద 51-28 జ్యే 17-24 వరా 3-54 మొ 10-24 క |
| | 21 | గు | ఏ 45-36 మూ 17-37 సిద్ధి 52-1 సర్వోపవాసం |
| | 22 | శు | ద్వా 39-15 పూషా 9-18 ది 27-46 వ. పా 5-31 మొ 7.0 క |
| | 23 | శ | త్ర 37-1 ఉషా 4-47 ది 17-57 వప 11-59 మొ 1-23 మహాశివరాత్రి |
| | 24 | ఆ | చతు 26-52 శ్ర 0-7 ధని 55-50 ప.వ 10.10 మొ 11-39 క పిత్ర్యయజ్ఞం |
| | 25 | సో | ● అమా 21-7 శత 52-28 తిథిద్వయం, అమాసోమవ్రతం, సూర్యగ్రహణం |
| | | | ఫా ల్గు ణ మా స ము |
| | 26 | మం | శు పాడ్యమి 16-2 పూభా 49-39 ద్వితీయాతిథిః, చంద్రోదయం |
| | 27 | బు | వి 11-48 ఉభా 47-57 ది 17-30 వ.ప 11.46 మొ 1-19 క |
| | 28 | గు | త 8-40 రే 47-7 ది 17-19 వప 1-18 మొ 2-53 క |
| | 29 | శు | చ 6-47 అశ్వ 47-40 త్యా 4-2 వ.రా 9-22 మొ 10-59 క |
| 1952 సం॥ మార్చి నెల | 1 | శ | పం 6-5 భ 49-24 ది 12-21 వప 11-17 మొ 12-56 క |
| | 2 | ఆ | ష 6-41 కృ 52-17 ది 20-48 వప 2-40 మొ 4-20 క |
| | 3 | సో | స 8.0 రో 56-2 త్యా 4.15 వరా 8-13 మొ 9.45 క భానుసప్తమి |
| | 4 | మం | అ 11-18 మృ 60-10 ది 11-10 వప 10-47 మొ 12-31 దుర్గావ్రతం |
| | 5 | బు | న 15-2 మృ 0-52 ది 27-50 వప 3-50 మొ 5-35 దశమీతిథిః |
| | 6 | గు | ద 19-22 ఆ 6-27 వరా 10 4 మొ 11-50 శూన్యతిథిః సుదశావ్రతం |
| | 7 | శు | ఏ 27.59 పున 12-26 వ.రా 8-2 మొ 9.43 ఏకాదశితిథిః |
| | 8 | శ | ద్వా 28-47 పుష్య 18-20 త్యా 4-24 నృశింహద్వాదశి |
| | 9 | ఆ | త్ర 37-19 ఆశ్రే 24.14 త్యా 4.22 శనిత్రయోదశి కామదహనం |
| | 10 | సో | చతు 37-21 మఘ 29.39 త్యా 4-19 |
| | 11 | మం | ○ పూ 40-46 పూఫ 34-26 వతె 4-31 మొ 6-13 క బ్రహ్మోత్సవము మదన [పూర్ణిమ |
| | 12 | బు | బ పాడ్యమి 47-7 ఉఫ 38-19 త్యాజ్యాభావః |
| | 13 | గు | విదియ 47-26 హ 41.12 వ ఉ 6-20 మొ 3-1 క |
| | 14 | శు | త 44 32 చిత్త 42-55 ది 1.46 వ ఉ 6-54 మొ 8-33 క |
| | 15 | శ | చ 47-24 స్వా 47-24 వతె 5-4 మొ॥ భో 3.51 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.